# మీ బాబుకు రాశిఫలం సూచనలు ఏ విధంగా వున్నాయి?




## మరెక్కువ గ్లాక్సో ఇన్‌ఫేంట్ మిల్క్ ఫుడ్స్ తీసుకోవాలని చెప్తున్నాయి!



మీ బాబుకు ప్రస్తుతకాలం చాలా అనుకూలంగా వుంటుంది. గ్లాక్సో ఇన్‌ఫేంట్ మిల్క్ ఫుడ్స్ మీ ఇంటిలో వుంచుకోండి మరియు మీ బాబును హాయిగా మరియు ఆరోగ్యంగా వుంచండి.

మీ బాబు యొక్క ఆరోగ్యం చాలా బాగా వుంటుంది. మంచి దృఢంగా, చురుకుగా వుంటాడు. ఈ పుష్టిగల గ్లాక్సో ఇన్‌ఫేంట్ మిల్క్ ఫుడ్స్‌తో బాబు నేత్రాలు చాలా తేజోవంతగాను, ఎముకలు బాల దృఢంగాను వుంటాయి. ప్రేమ, చిరునవ్వులతో చిందులు త్రొక్కుతూ వుంటాడు. ఊదా మరియు సిలిరంగు బట్టలు మీ బాబుకు వేయండి.

అదృష్టానికి గ్లాక్సో సన్‌షైన్ లేక ఓస్టర్‌మిల్క్ డబ్బా వుంచుకోండి—ఇవి తయారుగా లభిస్తాయి-అనువుగా

గ్లాక్సో ఇన్‌ఫేంట్ మిల్క్ ఫుడ్స్‌లో విటమిన్ 'డి' సమృద్ధిగా వుండుటవల్లే, రికెట్స్ మరియు దంత జబ్బులు రాకుండా కాపాడుతోంది. ఇవి శరీరం దృఢంగా, ఎముకలు తిన్నగా, మంచి పళ్ళు, శరీర ఛాయ చక్కగా వుండడానికి వుపకరిస్తోంది.




# గ్లాక్సో ఇన్‌ఫేంట్ మిల్క్ ఫుడ్స్

Interpub/GL/7/76 TEL

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది!

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణీ సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:

**1** 

దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.

**2** 

దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది . రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా అమ్మబడుతున్న దోమల నివారిణి అంటే ఆశ్చర్యమేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

# ఓడోమాస్

**అందుబాటులో ఉంచుకోండి!**




CHAITRA-BLS 85 TEL

# ★ ఉత్తరాలు ★

## అట్టమీద బొమ్మ

ప్రఖ్యాత నర్తకీమణి జయశ్రీ. టి. ముఖచిత్రం 'ఆంధ్రసచిత్రవారపత్రిక 21-5-76 కే హైలెట్. షష్టిపూర్తి చేసుకున్న పెద్ద మనుషులు కూడ మీరు ప్రచురించే ముఖచిత్రాలను చూసి పరవశించక తప్పదు

కలపటపు గిరిజాకుమార్ (విజయవాడ)

* * *

21-5-76 నాటి జయశ్రీ. టి ముఖచిత్రం చాల ఆకర్షణీయంగా యున్నది. ఈ వారం సామాన్యని సణుగుడు (అర్థంలేని పెరుగు) శీర్షిక చాల బాగున్నది.

కె జగన్నాధరాజుపంతులు (గు॥ రాజుపాలెపల్లి)

## సీరియల్

"కాలమిచ్చిన తీర్పు అన్నపూర్ణగారు రచించిన సీరియల్ చాలాచాల బాగుంది. ఇంత చక్కగా వ్రాసి నందుకు చాల చక్కటి సీరియల్స్‌ని ప్రచురిస్తున్న మీకు నా హృదయపూర్వక అభినందనలు తెలుపుకుంటున్నాను. పోతే ఇక "కనువిప్పు" సీరియల్ సమాజానికి చాల దగ్గరగా ఉన్నందువల్ల ఇప్పటివరకు అది కూడా చాలా చక్కగానే ఉంది. వద్దనుకున్నాటే లక్ష్మీ ప్రసన్నగార్కి కూడ నా హృదయపూర్వక అభినందనలు చెప్పండి. ఇప్పటి వరకు మీరు ప్రచురించిన సీరియల్స్‌లో "కాలమిచ్చిన తీర్పు" చాలా చక్కగా ఉంది. ఇట్లాంటి సీరియల్స్, ఇంకా మంచి సీరియల్స్ కూడా మా కోసం ప్రచురిస్తారని మనసారా మిమ్మల్ని కోరుతున్నాను. ఇక కథలలో "కొలుపు" కథ చాలా చక్కగా మంథా వెంకటరమణా రావుగారు వర్ణించేశారు. నిజంగా ఆ కథ చదువుతున్నంతసేపు నేను ఆ పల్లెటూరిలో విహరించి వచ్చినట్లు అనిపించింది. శ్రీనివాస్‌గారు సినిమాగూర్చి బాగా వ్రాస్తున్నారు.

వి. ఎస్. శర్మ, (సాలూర్).

* *

"కాలమిచ్చిన తీర్పు" సీరియల్ ముగింపు మాకు ఎంతగానో నచ్చింది. జనరల్ హాస్పిటల్ బెడ్‌మీద స్పృహ లేకుండా పడివున్న విశ్వాన్ని చూసి "భయపడకమ్మా! నీది మంచి మనసు మంచి వాళ్ళకు దేవుడెప్పుడూ అన్యాయం చేయడు" అంటూ రామనాధం తన కూతురిని ఓదార్చేప్పుడు మా గుండెలు కరిగిపోయాయంటే నమ్మండి నిజంగా ఆ దేవుడు చివరికి విశ్వంని ఏమిచెయ్యలేకపోయాడు. మంచి మనసు ఉన్న వారికి ఆ దేవుడు ఎప్పుడూ అండగా ఉంటాడని నిరూపించిన రచయిత్రిగారికి మా హృదయపూర్వక అభినందనలు!....

జి. భాగేశ్వర్‌రావు శివపేట, (సేలం)

ఈ వారం ఆంధ్ర సచిత్రవారపత్రిక, ముమ్మల్ని ఎంతో ఆకర్షించింది "ప్రశ్నావళి చాలా బాగున్నది ఈ వారం "సినిమా" లో చాల విషయములు తెలిసినవి శ్రీనివాస్‌గార్కి మా అభినందనలు. కథలు కూడా చాల బాగున్నాయి "మల్లెమాల" కథ చాలా బాగున్నది "సీరియల్స్" లో "కనువిప్పు" ముమ్మల్నెంతో ఆకర్షించింది అల్లారు ముద్దుగా పెరిగిన విశాల అత్తగారిచేత తిట్లుతింటూ ఇంటిపని చాకిరీ చేస్తుంటే విశాల కేకాదు, ఆ పనులు మేము చేస్తున్నట్లు పీలయ్యాము రచయిత్రిగారు చక్కగా మలుపు త్రిప్పారు (కథని) వారికి మా ధన్యవాదాలు మరీ, మరీ, తెలుపండి.

జి. భారతి, (అర్తమూరు)

## కథలు

14-5-76 తేది పత్రికలోని కథ 'మల్లెమాల' రచయిత శ్రీ మురాల రాఘవయ్యచే వ్రాయబడిన కథ చాల చాల బాగున్నది స్త్రీలలో అనుమానము చాల మన్నితంగా వివరించారు రచయితకు నా అభినందనలు.

టి శకుంతల, (గుంటూరు)

## డాక్టర్ సలహాలు

7-5-76 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో డాక్టర్ సలహాలు శీర్షికలో కీళ్ళనొప్పులు రావటానికి గల కారణమేమిటి? దానిని నిర్మూలించుటకు ఏమిచేయవలెను. అని స్కైసిల్క్ పాటకుడు వ్రాసిన ప్రశ్నకు డాక్టరుగారు 5, 6 వారాల పాటుగా ఆంధ్రపత్రిక దినపత్రికలో "డాక్టర్ జవాబు" అనే శీర్షికలో తెలియజేశామన్నారు. కాని ఆంధ్ర పత్రిక దినపత్రిక, వారపత్రిక రెండు పత్రికలు చాల తక్కువమంది పాటకులు కొంటారని నా అభిప్రాయం ఒకవేళ ప్రక్కవారి నెవరినన్నా అడుగుదామంటే పాత పత్రికలు అన్నీ వారిదగ్గర ఉంటాయో, ఉండవో? ఉన్నా, ఇవ్వనివారు కొందరు ఈ ప్రశ్న గురించి డాక్టర్ గారు సదహాలతైనల పేరాద్వారా తెలియచేశారు అంతవ్రాసి జవాబిచ్చే బదులు ఆ పాటకుని ప్రశ్నకు ఇంతకన్న తక్కువ లైనులలో జవాబుచెప్తే చాలా బాగుండేది. ఇలా ఆయన వ్రాయటం ఆ పాటకునికే కాదు. మాలాంటి అనేకమందికి జవాబు నిరుత్సాహం కలిగించినటానికి చాలా విచారిస్తున్నాను ఏ పాటకుడైనా ఒకసారి ఇచ్చిన జవాబు చూసి మళ్లీ ప్రశ్నలడగడని నా అభిప్రాయం. అసలు డాక్టర్ సలహాలు శీర్షిక ఎందుకు? ఎవరికైనా ఏదైనా సమస్యవుంటే దానిని పత్రికాముఖంగా అడిగి తీర్చుకోవటానికి కదా!

కె. యస్. ప్రకాశరావు (కలమట్టపుగల్లు)


**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938-1972]

శుక్రవారం : 4-6-'76

నలనామ సం. జ్యేష్ఠ శు. సప్తమి

సంపుటము 69 సంచిక 39

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా - రు. 33-80
ఆరుమాసాల చందా - రు. 16-90
విడి ప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక



# అభిమానులెందరో మీ ముఖానికి, శత్రువులెందరో మీ చర్మానికి. పాండ్స్ వానిషింగ్ క్రీమును దగ్గఱుంచుకోండి.

పాండ్స్ వానిషింగ్ క్రీమ్ గాలి, ధూళి, శీతోష్ణాల నుండి మీ చర్మాన్ని కాపాడుతుంది. చర్మంలోని తడి ఆరిపోకుండా చేసే హ్యూమెక్టెంట్ అనే విశేషపదార్థం అందులో వుండడంచేత చర్మానికి తళతళలాడే సౌందర్యం కలుగుతుంది.
అది జిగట లేక నున్నగా మిలమిలలాడే అందాన్ని అందిస్తుంది. దానిని నిండైన పౌడర్ బేస్‌గా ఉపయోగించండి. అది మీ అలంకరణను గంటలతరబడి తాజాగా, అందంగా ఉండేట్టు చేస్తుంది. లేకపోతే పరిపూర్ణ అలంకరణ సాధనంగానూ ఉపయోగించండి.
గుర్తుంచుకోండి—మీ లాగే మీ చర్మానికి అనురాగం అవసరం.






చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమిత బాధ్యతలతో యు.యస్.ఎ.లో సంస్థాపితమైనది.)

CP-1178

**Pond's**

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**కె. వి. ఆర్. ఆర్. — నిడదవోలు**

అత్యవసర పరిస్థితి వల్ల మెరుగు జరిగిందంటారా?

మహారాజులాగా. ఇంకా ఎంతో బాగా జరుగుతుంది. మరీ సామాన్యుని జీవితం గడ్డుగా తయారు చేసేసిన దుష్ట విజృంభణకి నయాన చెప్పి లాభం లేదని ఈ పరిస్థితి నిరూపించింది. ఇప్పుడేనా క్రమశిక్షణ, పద్ధతి బాగా మన ధర్మంగా అలవాటు చేసుకోవడమే కాదు. నా వూరు, నా జిల్లా, నా రాష్ట్రం అంటూ గిరులు వేసుకోవడం మానేసి దేశం మొత్తం ఒక్కటిగా చూడడం కూడా అలవాటు చేసుకోవాలి. ఒక వ్యక్తి స్వేచ్ఛ పదిమందికి ప్రాణసంకటం అయ్యే ప్రమాదం నుంచి తప్పించింది మన పి. ఎమ్. అదే పదివేలు.

## బొమ్మలో బొమ్మ



ఈ స్వాములవారు గడ్డాలు గట్రా గట్టిగా పెంచారు కాని, తలలో మాత్రం తరుణీమణి ధ్యాస తప్ప మరొకటి లేనట్లుంది. జాగ్రత్తగా చూస్తే ఆ లలనామణి కనబడుతుంది.

**జె. సి. హెచ్. ఆర్. — అనంతపురం**

రాసుతాను మీ రచయిత్రులు మరీ అలా రాస్తున్నారేమిటండీ? వాటికి అర్థం పాపి వరస ఉండక్కరలేదా? అలా చేసేవాళ్ళున్నారు కనుక రాస్తున్నారంటూ జవాబిచ్చి తప్పించుకోకండి. సరైన జవాబివ్వండి.

బాగుంది. పిస్టల్ గురిపెట్టి జవాబు చెప్పిస్తే అది న్యాయంకాదు రావుగారూ, నేను సీరియల్ నవలలు ప్రతి వారం జరిగిన కథ మాత్రమే చదివి ఊరుకుంటాను. అంచేత నాకు అంత వివరాలు తెలియవు. ఇక అచ్చువేయడం రాయడం అంటారా?.... అది అంతే మరి.

**ఎన్. వి. — కలకత్తా**

ఆడపిల్లకి పెళ్లి చేశారట. ఎంతవరకు మునిగిపోయారు?

మేం ఆడపిల్ల మగపిల్ల అంటూ తేడాలు చూసి ఎరగం. అంచేత అమ్మాయి పెళ్లికీ మునగ లేదు. అబ్బాయి పెళ్లికీ మునగం. అయినా ఈ రోజుల్లో కూడా యిదేం ప్రశ్న!

కట్నం నిషేధించినంత మాత్రాన ఈ సంప్రదాయం పోతుందా?

మనుషులకి దొంగ బుద్ధులు, సిగ్గులేనితనం, ద్వంద్వ నీతి, అత్యాశ, దోపిడీ తత్వం ఇవన్నీ చావనిదే ఏ సాంఘిక నేరం సమసిపోదు. రూపాంతరం చెందుతుంది. 'కట్నం అడిగినవాణ్ని చేసుకోను' అన్న తిరుగుబాటు అమ్మాయిల దగ్గరనుంచి రానిదే లాభంలేదు. తలిదండ్రులు కట్నమో, కష్టమో పడి కూతుళ్లని కట్టబెట్టి పంపాలన్న చాదస్తానికి స్వస్తి చెప్పనంతకాలం ఈ సమస్య సమసిపోదు. చదివిస్తారు. ఉద్యోగాలు చెయ్యనిస్తారు. మరి పెళ్లి దగ్గరకొచ్చేసరికి అమ్మాయిని అణిచివేస్తారు. ఎందుకనో. అర్థం కాదు. ముస్టో నస్టో ఎత్తి కట్నం యిచ్చి పెళ్లి చేసినంత మాత్రాన అమ్మాయి ఆనందంగా సంసారానికి వెళ్లిపోతుందని అనుకోవడం అమ్మాయిన మానసికారాటం గ్రహించకపోవడమే.

**ఎ. ఆర్. ఎస్. — వైజాగ్**

ఎవరికోసం త్యాగం చేశామో వాళ్లు మనని గుర్తించక పోతే బాధ కదూ అక్కయ్యా?

అందుకే, చిట్టి చెల్లెలా త్యాగం ఫలితం కోరకూడదు. దానం తిరిగి వస్తుందని చేస్తారా?.

**కె. ఎస్. ఆర్. — ఖమ్మం**

మీరు స్వర్గం - నరకం చూశారా? చూడకపోతే చూడమని నా సలహా. ప్రతి స్త్రీ చూసి బుద్ధి తెచ్చుకోవలసిన చిత్రం అది.

చంపేశారు ఇంతా చేసి సినిమా చిత్రమా అది ఏమో నేనీ సంఘంలో రోజూ కాస్త కాస్త స్వర్గాన్ని కాస్త కాస్త నరకాన్ని చూస్తూనేవున్నానే అనుకుంటున్నాను.

# హైదరాబాద్ నోట్ బుక్

**కుక్కలు కానరాని దేశం:**

కాకులు లేని ద్వీపం లక్షద్వీపాల్లో ఒక్కటి ఉందని విన్నాం. కాని కుక్కలు లేని దేశం ఉందంటే ఎవ్వరికయినా విడ్డూరమనిపిస్తుంది. ఇదేకాదు. "మందుకైనా 'మందు' చుక్క లేకపోవడం దొంగతనాలు కాగడా పెట్టి వెదికినా దొరకకపోవడం, హత్య అంటేఏపిట్టో పేరనడం వంటి విచిత్రాలుఇంకాఎన్నో ఉన్నాయి. ఇలాంటి దేశం లిబియా. పశ్చిమాఫ్రికాలో ఉంది. ఈ సంగతులన్నీ లిబియాలోని ఫెజ్జాన్‌రాష్ట్రం రాజధాని అయిన సేబానగరంలో సెంట్రల్ హాస్పిటల్‌లో సర్జనుగా పనిచేసి, యిటీవలే ఇక్కడికి వచ్చిన డాక్టర్ కె. ప్రభాకరశాస్త్రి తెలిపారు. అక్కడివారి నిజాయితీ ధర్మచింత ఆయన వల్ల తెలిసి, అవి మన ప్రజలకూ ఉంటే ఎంత బాగుండునని అనిపించింది. భారతీయులు అక్కడ అన్ని రంగాలలోను ఉన్నారు. రోగులు ఆస్పత్రికి వస్తారు. విచిత్రమేమిటంటే వారే ఐదారు నిముషాలపాటు డాక్టరును కుశలప్రశ్నలు వేస్తారు. నిజమైన ఇస్లామిక్ సోషలిస్టు దేశం అదే. ప్రతి పౌరునికీ వ్యవసాయమో, పనో, ఏదోవృత్తి గ్యారంటీ ఉంది. ప్రభుత్వందే బాధ్యత. పార్లమెంటు జరుగుతున్నాసరే, రేడియో టెలివిజన్ ప్రసారాలైనా సరే నమాజు సమయం వస్తే, ఆగిపోవలసిందే. మద్యనిషేధం నిజంగా ఉంది. కుక్కలు లేవు. దొంగతనమన్నది లేదు. రైలు లేదు. రోడ్డు ప్రమాదాలు మాత్రం ఎక్కువ. ప్రజలు మంచి ఆజానుబాహువులు. మహిళలు అందమైనవారు. వారికి ఫ్రెంచి, ఇటాలియన్, ఇంగ్లీషు భాషలు వస్తాయి. కాని, మాతృభాష తప్ప మరొకటి మాట్లాడరు. భక్తి అపారం. సామాన్యప్రజలు కూడా దేశసంపదను ఎంత శ్రద్ధతో కాపాడతారో డాక్టర్ ప్రభాకరశాస్త్రి ఒక సంఘటన చెప్పారు: లిబియా నైజర్ సరిహద్దు రక్షణ పోలీసులు జబ్బుపడ్డారు ఆ ప్రాంతం సేబానగరానికి 400 కిలోమీటర్లలో ఉంది. షుర్తాలకు (పోలీసులకు) చికిత్స కోసం ఒక వ్యానులో బయలుదేరాను. రెండు రోజులు పయనం. వ్యానుకు తగిలించిన ట్రెయిలర్ ఎడారి దారి గతుకులు కుదుపులకు ఎగిరిపడి మందు మాత్రలు ఇసుకలో ఒలికిపోయాయి. సహారా ఎడారిలో వెదకడమంటే మాటలా? నావెంట ఉన్న లిబియా సహచరులు వ్యాను ఆపి, దిగి, రెండు గంటలు సేపు మందులను ఏరారు. మా దేశం ఎంతో డబ్బు ఖర్చుపెట్టి తెప్పించిన మందులు సహారాపాలయితే ఎంత నష్టం. ఏరడంకన్నా మరేమిటి మాకు

(38వ పేజీ చూడండి)

## గోద్రెజ్ నుంచి




క్రొత్త బట్టల సబ్బు

అయినా తక్కువ వెల
ఇప్పుడు
55 పైసలే*
* పన్నులు అదనం

# మళ్ళీ మరోసారి మంచి లాభం!

చక్కని ఉతుకు
సుగంధపూరితమైన ఉతుకు

## గోద్రెజ్
బట్టల సబ్బు

CMGS.82.234 TL

**ఆదివారం సాయంత్రం సనత్ నగర్ — బస్సు కోసం ఎదురు చూస్తోంది నళిని**

నాంపల్లి వైపు వెళ్లే బస్సులు వస్తున్నాయి — జనం ఎక్కుతున్నారు గాని రాణీగంజ్ వైపు వెళ్లే బస్సులు మాత్రం ఎంతకూ రావడం లేదు.

చూస్తూండగానే బాగా చీకటి పడిపోయింది క్రమేపి రోడ్డుమీద జనం పలచబడుతున్నారు

'పోనీ ఆటోరిక్షాలో వెడితేనో' అనుకుంది నళిని, సమయానికి ఖాళీ ఆటోరిక్షాలు కూడా రావటంలేదు అటువేపు.

ఆమె వచ్చినప్పటి నుండీ గమనిస్తోంది ఓ ఇద్దర్ని వాళ్ళు బస్‌స్టాపులోనే నిలబడి ఏవేవో మాట్లాడుకుంటున్నారు

"మా ఇల్లు ఈ నెలాఖరుకు పూర్తి కావచ్చు ఏమిటో సొంత ఇల్లంటూ ఇన్నాళ్లకు ఏర్పరుచుకోగలిగాను ఇంక మనం ఈ ఊరు నుండి కదలక్కర్లేదు. చూడండి మాధవరావుగారూ నాకు చాలా కాలం నుండీ ఒక కోరిక ఇంటి చుట్టూ రకరకాల మొక్కలుండాలి. డాబా ఆర్చిమీదకు రంగు రంగుల బోగన్‌విల్లా పూలు గాలికి కదులుతూండాలి ..."

"అదృష్టవంతులు జగన్నాథంగారూ మీకు అట్టే బాధ్యతలు లేవు మా తమ్ముడి చదువు ఈ ఏడాదితో అయిపోతుంది చెల్లెలికి సంబంధం కుదిరింది పెళ్లి చేయాలి. ఇవన్నీ అయి అప్పటికి హౌసింగ్ బోర్డువారి ధర్మమా అని నాక్కూడ ఎక్కడయినా ఇల్లు తగిలిందంటే ఓ ఇంటివాడిని అయి ఈ హైదరాబాద్ నుండి కదలక్కర్లేదు..."

"అదేమిటండోయ్ — మీకు పెళ్లి అయిందిగా"

"భలేవారే — పెళ్లయిందిగాని అద్దె కొంపలోనే కదా వుంటున్నాము — సొంత ఇల్లు వుంటేనే గాని ఓ ఇంటి వాడికింద లెక్క గాదు..."

జగన్నాథం గట్టిగా నవ్వేడు. తన మాటలు నళిని విందో లేదో అని ఆమెకేసి ఓ చూపు విసిరాడు మాధవరావు.

నళినికి చాలా విసుగ్గా, కోపంగా వుంది. 'వెధవబస్సు ఎప్పటికి రాదేం ...' సహనం పోతోంది ఆమెకు.

అంతలో ఓ బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది నళినికి. మాధవరావూ, జగన్నాథమూ - రాణీగంజ్ బస్సుకోసమే ఎదురు చూస్తున్నట్టున్నారు. మిగతా నంబర్ల బస్సులు ఎక్కలేదు కాబట్టి తన అంచనా కరక్టైపోతే ముగ్గురమూ ఆటోలో వెళ్లిపోతే ఏం అప్పుడు ఈ చీకట్లో ఒంటరిగా అంతదూరం వెళ్లే భయం వుండదు.' ఆలోచనైతే బాగానే వుందిగాని ఎలా



"ఎక్స్క్యూజ్ మి..."

ఏమిటన్నట్టు ఇద్దరూ ఆమె కేసి చూసారు.

"అహఁ ఏం లేదు మీరుకూడా రాణీగంజ్ వైపు వెళ్లేలావుంటే ఆటోలో వెడదాము. నాకు సాయంవస్తే చాలు. దయచేసి మనీ నేనే ఇచ్చుకుంటాను..."

ఆమెకేసి విచిత్రంగా చూసి ఇద్దరూ ఒకరి నొకరి చూసుకుని అదోలా నవ్వేసారు.

నళిని తలలో సంపెంగపువ్వుని పరిశీలనగా చూసి గట్టిగా వాసన పీలుస్తూ.

"జగన్నాథంగారూ — పూలవాసన బ్రహ్మాండంగా ఉందండీ — దీన్నిబట్టి ఇది ఏ సరుకో ఇట్టే చెప్పేయవచ్చు కదండీ శేషగిరి అంటూంటే అబద్ధం అనుకున్నాం. అయితే ఇలాంటి బాపతూ వుంటారన్నమాట..." అన్నాడు మాధవరావు వెకిలిగా నవ్వుతూ— కళ్లెగరేస్తూ—

" మాస్తి తెలియడంలేదూ — పైకి అందరూ ప్రతివ్రతలే. పక్కా గృహిణిల్లా తయారయి ఇలా బస్సు స్టాపుల్లోనూ — రైల్వేస్టేషన్లలోనూ — ఆఖరికి సినిమాహాళ్ళల్లోనూ, వలవేసి మనలాంటి వాళ్లనూ ఎర్రగా బుర్రగా ఉండి కాస్త డబ్బున్న వాళ్లలా కనుపిస్తే చాలు పట్టుకుపోతారు. ఇది మామూలైపోయింది. ఆ మధ్య మన వెంకటేశాన్ని ఒకామె ఇలాగే తీసుకుపోయిందిట 'ఏమనీ—' అని అడగరేం. 'ఆటోలో చీకట్లో ఒక్కదాన్ని వెళ్లలేను. కాస్త సాయం వస్తారా. అని అడిగిందట. గుండె జారిదిగా పాపం వెంకటేశానికి అమాంతం ఎగిరి ఆమె పక్కలో ఆటోలో వెచ్చగా కూర్చుని."

"ఆఁ కూర్చుని..."

"భలేవారే— ఆ పై కథ—మర్నాడు ఆఫీసులో చెప్పుకుని ఒకటేగోల. అందులోనూ మొదటి తారీకేమో పూర్తిగా స్వాహా అయితే గాని ఒదల్లేదట ఆ మహాతల్లి. వెంకటేశాన్ని చూసి జాలిపడ్డా ఒకవేళ చేబదుళ్ళు ఎగకొట్టడానికి ఇలాంటి అందమైన అబద్ధం ఆడేడేమో అనుకున్నాగాని...ఈరోజు ఇప్పుడు"

"అవునవును కళ్ళారా చూస్తున్నాం చెవులారా విన్నాం"

వీళ్ల సంభాషణలు సాగిపోతూనే వున్నాయి· వింటూ భరించలేక అవమానంతో తల వంచుకుంది నళిని.

# ఆమె ఎవరు?

రతన్ ప్రసాద్

అంతలో వరసగా రెండు బస్సులు రాణీ గంజ్ వెళ్లేవి వచ్చాయి,

"బతుకు జీవుడా" అనుకుంటూ బస్సు ఎక్కింది నళిని. కావాలని అదే బస్సు ఎక్కారు జగన్నాథం, మాధవరావూ.

రాణీగంజ్‌లో అందరూ దిగేసారు.

నళిని రిక్షా ఎక్కింది.

ఆమెకు వినిపించేలా "పాపం పాచిక పారలేదని నిరాశతో ఇల్లు చేరుకుంటోంది. పోనీ షాడో అవుదామా..." మాధవరావు రిక్షాలోవున్న ఆమెకేసి చూస్తూ అన్నాడు.

"వద్దులెండి అసలే మొద్దుపోయింది. ఇంకోసారి చూద్దాం అంతగా అయితే" నాలుకతో పెదాలు తడుపుకుంటూ అన్నాడు జగన్నాథం.

రిక్షా వేగంగా వెళ్ళిపోయింది.

ఇద్దరూ పగలబడి నవ్వారు. దూరంగా వెళ్ళిపోతున్న నళినికి ఈ నవ్వు పిశాచాలు నవ్వినట్లు వినిపించింది.

"చూస్తూ జారవిడిచేస్తామేమో మొత్తానికి చిక్కనిది. బంగరు పిచ్చుకలా వుంది కదూ..." మాధవరావుకు — సమాధానం ఇవ్వకుండా ఏదో ఆలోచిస్తూ ముందుకు నడుస్తున్నాడు జగన్నాథం. బహుశః మనసులో తను కూడ అదే అనుకుంటున్నట్టున్నాడు.

* * *

మర్నాడు సోమవారం.

జగన్నాథం, మాధవరావులతో బాటు ఆఫీసంతా చాలా హడావిడిగా వుంది

ఆరోజే కొత్త డైరక్టర్ ట్రాన్స్‌ఫర్ మీద వచ్చి జాయిన్ అవుతున్నారు.

ప్రైవేటు డైరెక్టర్లు స్టాఫ్‌కు తగిన హెచ్చరికలు ఇస్తూ ఖంగారు పడిపోతున్నారు.

అంతలో 'డైరెక్టర్‌గారు వచ్చేస్తున్నారు' అంటూ కబురు అందించి తన సీట్లోకి వెళ్ళిపోయాడు చపరాసి.

కలకలం వెల్లువైన ఆ ఆఫీసంతా అతి నిశ్శబ్దంగా వుంది. అందరి కళ్ళూ ద్వారం వైపే వున్నాయి.

ప్రైవేటు డైరెక్టర్లు పరుగులాంటి నడకతో ఎదురు వెళ్ళి కొత్త డైరెక్టర్‌గార్కి స్వాగతం పలికారు.

హాల్లో కాలు పెట్టిన కొత్త డైరెక్టర్ గార్ని చూడగానే జగన్నాథమూ, మాధవరావు కొయ్యబారిపోయారు.

## ఆమె ఎవరు ?

నాలుకలు ఎండిపోయాయి. గుండెలు ఆగిపోయాయి ఇద్దరికి

దూరం నుండి నడిచి వస్తున్న కొత్త డైరక్టర్‌గారు నిన్న సాయంత్రం సనత్‌నగర్ బస్సు స్టాపులో తాము ఏడిపించిన 'నళినీదేవి గారే. అవును. ముమ్మాటికీ ఆమే.

జుట్టు పైకి అందంగా చుట్టి ముడి వేసుకుంది. పక్కలో ఒకే ఒక సంపెంగపువ్వు తురుముకుంది. వంటి రంగులో కలిసిపోయే రంగు పట్టుచీర కట్టుకుంది. ఎంతో హుందాగా నడిచి వస్తున్న ఆమె వి గహం దగ్గరవుతున్నకొద్దీ ఇద్దరికీ తల తిరిగి పోతోంది.

బస్సుస్టాపు సంపెగపువ్వు. సహాయంకోసం అర్థిస్తున్న ఆమె కళ్ళు—బస్సు—ఎక్కిన రిక్షా గిరగిరా తిరిగిపోతున్నాయి. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. చీకటి ముసుకు వస్తోంది.

"ఈయన మాధవరావు. వీరు జగన్నాథం వీరు చలపతి ..." నమస్కరిస్తున్న చేతులు వారి అధీనంలో లేవు. చలిజ్వరం వచ్చిన వాళ్ళలా వణికి పోతున్నారు. డిప్యూటీ డైరక్టర్ రంగారావు ఆమెకు మిగతావారిని పరిచయం చేయడానికి ముందుకు కదిలాడు.

వెడుతూన్న నళినీదేవి వీరిద్దరినీ నిశితంగా గుండెల్లోకి సూటిగా చూసింది. తలలు వంచుకున్నారు. ముందుకు వెళ్ళిపోయింది నళినీదేవి.

బొమ్మల్లా నిల్చిపోయిన మాధవరావునూ జగన్నాథాన్ని కుదిపి ఈలోకంలోకి తెచ్చాడు—సెక్షన్ ఆఫీసర్ సుందర్రావు.

"ఏమిటి? కొత్త డైరక్టర్ గార్ని చూడగానే అలాఅయిపోయారేమిటి ? అఖంగారేమిటి?"

సుందరావుకు ఏం జవాబియ్యాలో తెలియని స్థితిలో వున్నారు —

"ఈ డైరెక్టర్‌గార్నిగురించి చాలా విన్నాం. చండశాసను రాలు అని, స్టాఫ్‌ను మూడు చెరువులనీళ్ళు తాగిస్తుందనీ విశాఖపట్నం స్టాఫ్ గోల పెట్టింది. అయితే ఒకటి — సిన్సియర్‌గా పనిచేసే వాళ్లకు ఎంతో గౌరవం ఇస్తుందిట. ఏమైనా వారి విషయంలో మనం జాగత్తగా వుండడం మంచిది" అంటూ వెళ్లిపోయారు సుందర్రావుగారు.

తే [illegible]న్నట్టుగావే పిడ[illegible] టి వార[illegible]

''మీ ఇద్దర్నీ డైరెక్టర్‌గారు రమ్మంటున్నారు''అని. యాంత్రికంగా లేచినిలబడ్డారు. గుండె దడదడ లాడుతోంది. ఆమే—ఇప్పటి కొత్త డైరెక్టర్ అని కలలో కూడ ఊహించలేదు.

నిన్న సాయంత్రం ఆమె అడగ్గానే మర్యాదగా ఆటోలో ఆమెను ఇంటివద్ద దించితే ఈకథ ఇంకోలా వుండేది. అప్పుడు ఆమె దృష్టిలో శాశ్వతంగా తమకో ప్రత్యేక స్థానం ఉండేది. ఇప్పుడో అలాంటి అదృష్టాన్ని చేజేతులా నాశనం చేసుకున్నాం' ఇద్దరి మనస్సులో ఆందోళన.

ఎలాగో ఆమెగదిలోకి వెళ్లి టేబిల్ ముందు నుంచున్నారు అపరాధుల్లా.

ఆమె వారిని కూర్చోమనకుండా — అసలు వారికేసి కన్నెత్తి అయినా చూడకుండా ఏదో ఫైల్ సీరియస్‌గా చూస్తోంది.

ఓ పదినిమిషా లయింతర్వాత కళ్లజోడు టేబిల్‌మీద పెట్టి ఇద్దరికేసీ అతి తీక్షణంగా చూసింది.

ఇద్దరికీ గుండెలు అరికాళ్లలోకి వచ్చేశాయి.

ఎలాగో అతి కష్టంమీద—

''క్షమించండి'' అని అనకలిగారు మాధవరావూ, జగన్నాథమ్మూ.

''మిమ్మల్ని క్షమించడమా. అసంభవం. మీలాంటివారు ఉన్నంతవరకూ ఈ సమాజం మారదు. సాటివ్యక్తి ఏ పరిస్థితిలో సహాయం కోరేరో అర్థంకానట్టు నటించి నీచాతినీచంగా ప్రవర్తించారు.'' ఆమె కళ్ళు అగ్నిని కురిపిస్తున్నాయి.

ఆ చూపుకు తట్టుకోలేక తలలు భూమిలోకి దిగిపోయాయి.

''ఈ ఊరు నాకు కొత్త. ఒంటరిగా చీకట్లో అంతదూరం ఆటోలో వెళ్లడానికి సంకోచించాను. పైకి పెద్ద మనుష్యుల్లా కనిపించబట్టి — పైగా మీలో సభ్యతా సంస్కారం ఉన్నాయని అపోహ పడబట్టి మిమ్మల్ని రిక్వెస్ట్ చేయగలిగాను. కాని మీరు ఇంత నీచులని కలలోకూడా ఊహించలేదు..''

''క్షమించండి మేడమ్. అసలు మేము ఎప్పుడూ అలా ప్రవర్తించలేదు. అసలు అటువంటి పరిస్థితి మాకు ఎప్పుడూ కలగలేదు..''

''ఓ! వచ్చిన ఒక్క పరిస్థితీ ఉపయోగించుకున్నారన్నమాట. ఒక స్త్రీ మీ సహాయం కోరినంత మాత్రాన మీలో రాక్షసత్వం చోటు చేసుకుంటుందా! నేను కాబట్టి అసహ్యించుకుని ఊరికే ఉండిపోయాను. అదే ఏ అమాయకురాలో అయితే ఈపాటికి ఆత్మహత్య చేసుకునేది. లేదా నడిబజారులో మీ పరువు తీసేది. చదువూ, హోదా వున్నాయి కాబట్టి మిమ్మల్ని బజారుపాలు చేయలేకపోయాను. అదృష్టమో దురదృష్టమో నా ఆఫీసులోనే దొరికిపోయారు. మీలాంటి చీడపురుగులు ఈ ఆఫీసులో వుండకూడదు. అవినీతి, అసభ్య ప్రవర్తన కారణంగా మీ ఇద్దరినీ ఉద్యోగాల్లోంచి తొలగించబోతున్నా''

''మేడమ్...మేడమ్...ఈ సారికి క్ష...''

''వీల్లేదు. వెళ్లండి. ఐ సే యూ గెటౌట్..''

''మాకు బాగా బుద్ధి వచ్చింది మేడమ్ ఇంకెప్పుడూ ఇలాంటి పొరబాటు చేయం. ఈ ఉద్యోగాలు పోతే మా కుటుంబాలు నడివీధిలో వుంటాయి'' దీనంగా కన్నీరు కారుస్తూ జగన్నాథం అంటూంటే.

''అవును మేడమ్ మా జీవితంలో ఇలాంటిపని ఎన్నడూ చేయమని ప్రామిస్ చేస్తాం. ఈసారికి ఈ తప్పు కాయకపోతే మా కుటుంబాలు సర్వనాశనం అవుతాయి'' ఏడుపు ఆపుకుంటూ మాధవరావు అన్నాడు.

''ఆల్‌రైట్ మీ మొహం చూసి కాకపోయినా మీ భార్య పిల్లల మొహం 'చూసి ఈసారికీ వదిలేస్తున్నా అసలు ఆఫీసులో వర్క్ ఆట్టే చేయలేకపోయినా ఓ సమయంలో సహిస్తానేమోగాని ఎవరిలోనైనా సభ్యత లోపించిందంటే సహించను. క్షమించను. తమతో సమానంగా పనిచేసే పురుషుల్ని సోదరులుగా భావిస్తోంది స్త్రీ. కాని స్త్రీని మాత్రం సోదరిగా భావించుకునే విశాలహృదయం, సంస్కారం మీకు లేకపోతోంది. అందరూ మీలాంటి వారు కాదు. కొందరైనా మంచివా రుండబట్టే ఆడది కూడ ఉద్యోగాలు చేయగలుగుతోంది. ఏమైనా స్త్రీని స్త్రీగా గౌరవించే వరకూ మీలాంటి వాళ్లకు నిష్కృతి లేదు...''

వంచిన తలలు ఎత్తలేదు ఇద్దరూ.

చటుక్కున కళ్లజోడు పెట్టుకుని ఫైల్‌లోకి చూడ్డం మొదలు పెట్టింది నళినీదేవి.

ఉండాలో వెళ్ళిపోవాలో తెలియక తికమక పడ్డారు జగన్నాథం, మాధవరావు.

''ఊఁ వెళ్లచ్చు...''

ఆమె అనడం తరువాయి ఇద్దరూ బయటకొచ్చి పడ్డారు.

మాధవరావు, జగన్నాథమ్ మర్నాడే అందుకున్నారు ట్రాన్స్‌ఫర్ ఆర్డర్సు. ఉద్యోగాలు తీసేయలేదుగాని చెరో మూలకూ విసిరేసినట్లుగా వేరే ఊళ్లకు బదిలీచేసేసింది.

ఇద్దరి కళ్లల్లో నీరు ఉబికింది. ఆ కన్నీటిలో చదువు పూర్తి కావలసిన తమ్ముడూ, పెళ్లి కావలసిన చెల్లెలు, పూర్తిగాని కొత్త డాబా. దానిమీద గాలికి ఊగుతూన్నట్టున్న బోగస్ విల్లా పూలూ మెదిలి మసకబారాయి.





[illegible] లక్ష్మీప్రసన్న

(గత సంచిక తరువాయి)

మరునాటిరోజు సాయంత్రం, అయిదు గంటలకు స్నానం ముగించి తెల్లచీర జాకెట్టు వేసుకుని... "సుగుణా!" అంటూ హాలులోకి అడుగుపెట్టిన విశాలాక్షమ్మ వారిద్దర్నీ చూసి ఆశ్చర్యంతో తలమునకలయిపోయింది. ఎవరు? ఎవరది? ఏమిటా పెద్ద పెట్టున నవ్వులు ...? అందులో ఇద్దరూ కలిసి...!!! తన కోడలు...ఏ విధంగా చూసినా నవ్వుతూ ఉంటున్న తన కోడలు ... కొంప తీసి ... !!!

మనసులో ఉబుకుతున్న ఏవేవో ఆలోచ నలను పట్టి బలవంతాన అదిమిపెట్టి...వారిని సమీపించింది విశాలాక్షమ్మ ... అనుమాన దృక్కులతో. తనని చూసి ఇద్దరూ కంగు తింటారనుకుంది. అలాంటిదేమీ జరగలేదు. వారిద్దరి నవ్వులు మాత్రం ఆగిపోయాయి! అతనికి దాదాపు రఘు వయస్సే ఉంటుంది. రఘులాగానె అందంగాను హుందాగానూ గూడా ఉన్నాడు. అతను కూర్చున్న కుర్చీ పక్కనున్న టీపాయ్ మీద స్వీట్స్ పాకెట్టొక టుంది, అది అతను తెచ్చాడని తెలుస్తూనే ఉంది! తన్ను చూడగానే లేచి నిల్చుని వినయ విధేయతలతో నమస్కరించాడు. కోడలు సుగుణే పరిచయం చేసిందతన్ని. తన భావాలను గమనించి.

"ఈయన పేరు మాధవరావు! హైదరా బాదులో కొన్నాళ్ళున్నప్పుడు మా యింటి పక్కనే ఉండేవారు. అందుకని మా యింటిల్లి పాదికీ పరిచయం. ఈయనా వీరి శ్రీమతీను! చిలకలూరిపేటలో తండ్రి ఆస్తికి సంబం ధించిన వ్యవహారాలేవో పరిష్కారం చేసుకోవాలని హైదరాబాదు నుంచి వచ్చేరు ఓ పదిది కితం. అవన్నీ పరిష్కరించుకుని ఇక్కడే (గుంటూరులో ఓ మెడికల్ షాపు పెట్టుకుని స్థిరపడ్డారట. ఆ విషయం మాకు తెలియదు. రెండురోజుల క్రితం ఓ మందుల కంపెనీలో పనుండి వీరు హైదరాబాదు వెళ్ళి ... మాకు చాలాకాలమయిందిగాని ... మా యింటికి వెడితే నాన్నగారు చెప్పారట! మాకు పెళ్ళయి గుంటూరులో ఉంటున్న సంగతి! నాన్నగారిచ్చిన అడ్రసు ప్రకారం వెతుక్కుంటూ మా ఇంటికొచ్చారు. వస్తూ ... ఊరికే రావటం బాగుండదనుకుని ఉంటారు! దానికోసమేగాబోలు. స్వీట్స్ పాకెట్ గూడా తెచ్చారు!"

అయితే భార్యనుగూడా తీసుకురావచ్చు గదా? ఒంటరిగా ఎందుకొచ్చినట్లు? అదలా ఉంచి... ఆడగలబడి నవ్వటాలేమిటి? విశాలాక్షమ్మ మనసును రకరకాల ఆలోచనలు బాధిస్తున్నాయి. ఆమె మనసులోని విష యాన్ని పసిగట్టినట్టుగా ... మళ్ళీ తనే జవాబు చెప్పింది సుగుణ!

"అన్నట్టు మర్చిపోయానత్తయ్యా చెప్పటం వీరు 'శైన్' అనే కలంపేరుతో వ్యంగ్య చిత్రాలు గీస్తుంటారు. వీరి కార్టూన్లు అన్ని పత్రికలలోనూ వస్తుంటాయి. నిజజీవితంలో గూడా జోకులు పేలుస్తుంటారు! వాటికి పొట్టచెక్కలయ్యేలా నవ్వకుండా ఉండలేం! అసలు శ్రీమతిని తీసుకునే వచ్చేవారట ... ఆవిడ రెండోకాన్పుకు పుట్టింటికెళ్ళిందట!!"

మనసులో ఏవో భావాలు ముసురుకోగా గిరుక్కున వెనక్కు తిరిగింది విశాలాక్షమ్మ... వెళ్ళిపోవటానికి ఉద్యుక్తురాలవుతూ.

"అలా ఆ సోఫాలో కూర్చోండత్తయ్యా! వెళ్ళిపోతారేం?" అంది సుగుణ మామూలుగానే.

"రాజమ్మచేత కాఫీ పంపిస్తాను .." అని మరోమాటకు అవకాశమివ్వకుండా వంటిం ట్లోకి వెళ్ళింది విశాలాక్షమ్మ. ఆమె మెదడు నేదో పురుగు తొలవటం ప్రారంభించింది! అంత చనువుగా మాట్లాడుతోంది వాడితో, ఇదీ నాటిది మామూలు స్నేహమేనా...? అందులో పక్క పక్క యిళ్ళలోనే ఉన్నారట



# పరిశుద్ధమైన కాఫీ గింజలనుండి తయారయ్యే ఇన్‌స్టెంట్ కాఫీ ఒకటి మాత్రమే!

# ఇది.




దక్షిణ భారతదేశంలో లభ్యమయ్యే అత్యుత్తమమైన కాఫీ గింజల ఘుమాళింపు, ఎంతో సంతృప్తికరమైన రుచి. అదే నెస్‌కాఫే ప్రత్యేకత నూటికి నూరుపాళ్ళు పరిశుద్ధమైన కాఫీ మరే ఇతరమైన ఇన్‌స్టెంట్ కాఫీలోగాని లభించని ఒక ప్రత్యేకమయిన తృప్తిని ఇస్తుంది నెస్‌కాఫే.



ప్రపంచమంతటా
అత్యధికంగా
అమ్ముడుపోయే
ఇన్‌స్టెంట్ కాఫీ

**A NESTLÉ product**

# నెస్‌కాఫే

—100% పరిశుద్ధమైన కాఫీతో తయారయ్యే
ఒకే ఒక్క ఇన్‌స్టెంట్ కాఫీ

ANCM 22 TEL

# కను విప్పు

**జరిగినకథ** : అల్లారుముద్దుగా పెంచుకున్న కూతురు విశాలను సాంబమూర్తికిచ్చి పెళ్ళిచేస్తారు సరస్వతమ్మ, వెంకట్రామయ్యలు. విశాల అత్తగారు నరసమ్మ పులిలాంటి అత్తగారిముందు తనో మేకపిల్లని తెలుసుకుంటుంది విశాల. తల్లి చెప్పుడు మాటలు విని విశాలను హింస పెడ్తుంటాడు సాంబమూర్తి. మూడుసార్లు గర్భస్రావం జరిగినా నాలుగోసారి కొడుకుని కంటుంది విశాల. పక్షవాతంతో తల్లి చనిపోయిన కొద్దికాలానికే పేకాటలో తగాదాల మూలంగా హత్య చేయబడతాడు సాంబమూర్తి. అల్లారు ముద్దుగా పెంచిన కొడుకు రఘుకు సుగుణతో వివాహం జరిపించుతుంది విశాలక్షమ్మ.

కొన్నాళ్ళు...! వాడిలో స్వచ్ఛతనేదే ఉంటే... రఘు ఉన్న సమయంలోనే రావచ్చుగా ? ఇలా సాగిపోతున్నాయి విశాలాక్షమ్మ ఆలోచనలు

రాజమ్మచేత కాఫీ పంపించిన తర్వాత తలుపు వెనకగా పొంచి ఉంది విశాలాక్షమ్మ... వారేం మాట్లాడుకుంటారో వినాలనే ఆరాటంతో.

కాఫీలు పూర్తయ్యాక సుగుణ అంటోం దనితో

"తరచుగా వస్తుండండి మాధవరావుగారూ! పరిచయస్తులమే గానీ పరాయివాళ్లం గాదుగా!"

"ఓ! యస్! ఇప్పుడింకా టైంలేదు. ఈసారి వచ్చినపుడు మాత్రం మీ శ్రీవారిని తప్పక పరిచయం చేయాలి సుమా! మాట తప్పావో నీ కందరూ ఆడపిల్లలే పుడతారు!"

"జోక్ బాగుందిగానీ...ఆయన వచ్చి వుంటే ఈపాటికే పరిచయంచేసి వుండేదాన్ని"

"రోజూ ఈ టైముకు వస్తూనే వుంటారు. ఎందుకు లేటయిందో ఈ రోజు మరి?"

"మీ అత్తగారు లోపలున్నట్టున్నారు! ఆమెకు కూడా చెప్పండి మరి! ఇకనే వెళ్లిరానా?"

వీధి గేటు వరకూ సాగనంపటానికెళ్లింది సుగుణ కాఫీ కప్పులు తీసుకుని తిరిగివస్తూ తలుపుచాటునున్న విశాలాక్షమ్మను చూసి బిత్తరపోయి... "ఏందమ్మగోరూ.. ఈడుండారు?" అంది రాజమ్మ

"ఏం లేదు. ఏం లేదు..." తడబడి చకచకా అడుగులు వేసుకుంటూ పోయి హాల్లో సోఫాలో కూలబడింది.

ఈలోపుగా రఘు స్కూటరుమీదరావటం జరిగింది సుగుణ ఎదురెళ్ళి నవ్వుతూ పలకరిస్తూ..."అరె రె! ఒక్క అయిదు నిమిషాలు ముందుగా వచ్చి వుంటే ఎంత బావుండేది? ఆయన్ను మీకు పరిచయం చేసి వుండేదాన్ని! ఇప్పటివరకూ వుండి మీకోసం చూసి చూసి వెళ్లారు!"

"ఎవరాయన డార్లింగ్?"

"ఓ తెలిసినాయన!"

"అవన్నీ తర్వాత చూద్దాంలే! నువ్వు రడీయేగదా! నేనో పావుగంటలో రడీ అయ్యి వస్తాను! అమ్మ గ్రాంటు శాంక్షన్ చేసింది. నా కిష్టమైన ఓ ఆరు టెరిన్ పాంట్లు .. శ్లాక్ షర్ట్లూ సెలెక్ట్ చేసి పెట్టాలి రాణీగారు!"

"రాజాగారు అడగడం! ఈ రాణీగారు కాదంటుమూనా? ఓకె."

లోపలికొచ్చి ఒంటరిగా అదోలా కూర్చున్న తల్లిని పరామర్శించాడు రఘు ! "ఏమ్మా! అలా వున్నావ్ ! ఒంట్లో బాగా లేదా?"

"అబ్బే...బాలేకే .. బాగానే వుందిరా !"

ఇంకేం ప్రశ్నించలేకపోయాడామెను చూసి అయినా అతని మనస్సంతా అందాల భామ — భార్యామణి సెలెక్ట్ చేయబోయే డ్రస్సులమీదే ఉంది. పదినిముషాల్లో ... స్కూటరు మీద కొడుకు వెనకాలగా అతని నడుంచుట్టూ చేతు లేసి ... అతన్ని కరుచుకున్నట్లుగా కూర్చుని వెడుతున్న కోడల్ని తొలిసారిగా ద్వేషభావంతో చూసింది విశాలాక్షమ్మ.

* * *

రాత్రి తొమ్మిదిన్నరకు తిరిగొచ్చారు కొడుకు కోడలు ! తనింటిదగ్గర భోజనం చేయ్యకుండా వారికోసం ఎదురుచూస్తుంటే ...హోటల్లో భోంచేసిరావటానికి కారణం... కోడలే అయ్యుంటుందని విశాలాక్షమ్మ ఊహ! కాని కొత్త పెళ్లాంతో తీర్చుకునే సరదాల్లో ఒక భాగంగా "ఈపూట హోటల్లో భోజనం చేద్దాం సుగుణా!" అంటే "ఎలా ? పాపం

# హార్లిక్స్ ఆరోగ్యం.
# నాడూ, నేడూ, ఎల్లప్పుడు కూడా.
అంటుంది సుచిత్ర

## హార్లిక్స్ ఆరోగ్యంతో మీ కుటుంబపు భవిష్యత్తు తీర్చి దిద్దుకోండి.

ఆరోగ్యమే మహా భాగ్యం. విజయాలు, ఆనందం. ఆరోగ్యంగా వుంటే రోగాలు వుండవు. భద్రత పెరుగుతుంది.

అందువల్లనే సుచిత్ర, హార్లిక్స్‌ని తన కుటుంబపు జీవనంలో ఒక భాగంగా చేసుకుంది. హార్లిక్స్ కాల పరీక్షకి నిలబడుతుందని ఆమెకు తెలుసు.

హార్లిక్స్...ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది యిది ఒక్కటే. అంత ఎక్కువగా పుష్టి యిచ్చేది హార్లిక్స్ ఒక్కటే. ఎందుచేతనంటే, ఇందులోని బలవర్ధకమైన, కల్తీ లేని పదార్థాలని అపూర్వమైన హార్లిక్స్ తయారీ పద్ధతి ద్వారా సమ్మిళితం చేయబడ్డాయి.

సుచిత్ర మోస్తరుగానే మీరు కూడా మీ కుటుంబానికి ప్రతి రోజు హార్లిక్స్ యివ్వండి. ముందు ముందు వారు ఎంతో ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"మీరు హార్లిక్స్‌ని నమ్మవచ్చు.
నేను ఎల్లప్పుడు హార్లిక్స్‌నే సిఫార్సు చేస్తాను.



అనారోగ్యంగా వున్నప్పుడు పుష్టిగా వుండటానికి హార్లిక్స్ పుచ్చుకోమని చెబుతాను. దీనికి కారణం చాలా స్పష్టమైందే. హార్లిక్స్ శుద్ధమైనది. కల్తీ వుండదు. మాంసకృత్తులు, కార్బొహైడ్రేట్లు, ఖనిజాలు యిందులో చక్కగా కలిసి వున్నాయి. ఇవన్నీ నిత్యం మంచి ఆరోగ్యంగా వుండటానికి సహకారి."



ఒక రూపాయి
ఆదా చేయండి.
800 గ్రాం.
ఎకానమీ
జార్ కొనండి.




**దీనిలో ఆరోగ్యముంది.**

**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది** హార్లిక్స్ ఒక రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు.

HK 4115 Tel

## కను విప్పు

అత్తయ్య మనకోసం ఎదురు చూడరూ?" అని అందని "మా అమ్మకు నేనెలాగో సర్ది చెపుతానులే!" అని రఘు అన్నాడని విశాలాక్షమ్మకేం తెల్సు ?

సుగుణెంత బ్రతిమాలినా .. తప్పయి పోయింది క్షమించమన్నా ... ఒక్క మెతుకు గూడా కతకలేదు విశాలాక్షమ్మ! ఆమె రూపం చూసి ఏమీ అనలేకపోయాడు రఘు.

తరువాతరోజు ఉదయం నుంచీ వాతావరణం మారిపోయిందా ఇంట్లో!

రఘు వాకిట్లో ఎక్కడో మూల కూర్చుని 'షేవ్ చేసుకుంటున్నాడు విశాలాక్షమ్మ తన గదిలోనే ఉంది పూజతోసహా ముగించుకుని

మామూలు ప్రకారం తీసుకెళ్లి "అత్తయ్యా! ఇదిగో తీసుకోండి కాఫీ! రాత్రి భోజనం కూడా చేయలేదు మీరు!" అంది

"నాక్కాఫీ ఇవ్వటానికి పని మనిషి రాజమ్మ ఉంది!" కఠినంగా అంది విశాలాక్షమ్మ సుగుణ మొహంవైపు చూడనన్నా చూడలేదు మామూలుగా రోజూ అయితే... తనవైపు ప్రసన్నంగా చూసి నవ్వుతూ అందుకునేది

సుగుణ మనస్సు చివుక్కుమంది ! అత్తగారి కొత్త ధోరణికి తను కాపరానికొచ్చిన తర్వాత 'అత్తయ్య తనతో ఇలా ప్రవర్తించటం ఇదే ప్రథమం! దీనికంతటికీ కారణం రాత్రి తాము హోటల్లో భోంచేయటమే'నని భావించి ఇకముందు అలాంటి పనులు అత్తగారి యిష్టానికి వ్యతిరేకంగా చేయకూడదని నిశ్చయించుకుంది సుగుణ

ఈలోపుగా విశాలాక్షమ్మే అంది గదమాయింపుగా "అక్కడ పెట్టివెళ్లు!"

ఇక చేసేదిలేక... "తరువాతన్నా సమాధాన పరచాలి!" అనుకుంటూ వెళ్లిపోయింది సుగుణ ఆదెయ్య కూరలు తేగా రాజమ్మ వాటిని తీసుకెళ్లటం ఆపైన...వంటంతా తన పర్యవేక్షణలో చేయించటం అలవాటు చేసుకుంది సుగుణ ఇక్కడికొచ్చిన తరువాత! అదే అలవాటు ప్రకారం వంటింట్లోకి వెళ్లబోతున్న సుగుణను పిలిచి మరీ మరీ చెప్పింది విశాలక్షమ్మ

"నువ్వా వంటింటి ఛాయలకు పోయినా నేనూరుకోను! వంట నా సలహా ప్రకారం జరుగుతుంది ప్వాళనుంచీ!"

"అత్తయ్యా! ఎందుకీ శిక్ష నాకు" అని అరుద్దామనిపించింది దుఃఖంతో సుగుణకు. కానీ అలా అరిస్తే పనివాళ్లముందు లోకువయిపోతుంది తన. ఏమనుకుందో ఏమో మౌనంగా తన గదిలోకి వెళిపోయింది

రఘు కాలేజీకి వెళ్లిన దగ్గరనుంచీ సాధింపు యింకా ఎక్కువయింది. "అత్తయ్యా మీకేదన్నా షాపింగుపని వుందా? వెళ్దామా?" ఇప్పుడు పలకరించాలిగదాని ఏదో మాటవరసకంది సుగుణ

"షాపింగుకు కాదు స్మశానానికెడదాం పద!" వర్షించటానికి సిద్ధంగా వున్నాయి సుగుణ కళ్లు. తనేమంత కానిమాటన్నానని.. కాని పని చేసిందని.. అత్తయ్య ఇలా మారిపోయింది. ఇలా గుచ్చుకునేట్లు మాట్లాడుతోంది! కన్న కూతురుకన్నా ఎక్కువగాచూసుకున్న అత్తయ్యేనా ఇలా మాట్లాడేది? ఇంతకు కారణమేమిటి? రాత్రి విషయమేనా? లేక ఇరుగుపొరుగువా రెవరైనా తనమీద పుల్లింగాలు చెప్పారా?

"అత్తయ్యా! మూడయింది కాఫీ పెట్టించి పట్టుకొస్తాను!" అత్తను ప్రసన్నురాలను చేసుకోటానికి తెగ ఆరాటపడిపోతోంది సుగుణ, అత్త తనతో అలా ప్రవర్తించటం కత్తిపెట్టి తన హృదయాన్నెవరో ముక్కలుగా కోస్తున్నట్లుగా ఉంది.

"పట్టుకొచ్చి నా నెత్తిమీద పెట్టు!" తిరస్కారం గుప్పించేస్తోంది విశాలాక్షమ్మ మాటలలో అలా మొదలైన సాధింపులు ఇంతై... అంతై...ఎంతో పెరిగిపోయాయి – రోజులు గడిచినకొద్దీ సుగుణ ఉనికే భరించలేకుండా వుంది విశాలక్షమ్మ ఎంత చదువుకున్నా... అత్త సరిగ్గా చూడకపోతే కోడలుగతి ఇంతే నన్నమాట! తీరని వ్యథతో కుమిలి పోవాలన్న మాట! హోటల్లో భోంచేసి రావటమనేది చాలా స్వల్పమయిన విషయం అంత మాత్రానికే యింత శిక్ష విధించాలా? తిట్టాలా కొట్టాలా .. గొంతు నొక్కితె వాడే చస్తాడన్నట్లు చేస్తోంది అత్తయ్య! తిట్టదు ... కొట్టదు ... కాని ఒక్కోమాట శూలంతో గుండెలో గుచ్చి పైకెత్తినట్లుంటుంది .. అందులోని వ్యంగ్యం! ఇంకా దారుణమయిన విషయమేమిటంటే – ఏవీ తను ముట్టుకోటానికి అర్హురాలు కాదన్నట్లు వెలివేసినట్లు చేసింది దీనివల్ల తనెంతో లోకువయి

పోయింది రాజమ్మకు నౌకరు ఆదెయ్యకూను! మొదట చూపిన గౌరవాన్ని వారిప్పుడు తన కివ్వటంలేదు. తన లెక్కేమిటన్నట్లు ప్రవర్తిస్తున్నారు! అవమానభారంతో ఎన్నో సార్లు తలదించుకుపోయిన సందర్భాలున్నాయి. తన కళ్లలోని కన్నీరు ఉబికి రాబోతుంటే... ఆనకట్టువేసిన సందర్భాలు చాలా ఉన్నాయి. ఎందుకిలా హేయంగా తయారయింది తన బ్రతుకు? దీనిలో తను చేసిన తప్పేమిటి? తనను తాను సమాధానపరచుకోలేక పోతోంది సుగుణ. చదువుకొన్న చదువు — "ధైర్యంగా ఉండి సమస్యను పరిష్కరించుకో సావధానంగా!" అని ప్రోత్సాహ పరుస్తున్నా — "ఎంతైనా నువ్వు ఆడదానివి! అందులో అప్పచాటు కోడలువి! అత్త మంచితనం లేకపోతే నీ బ్రతుకు రాణించదు! ఆమె ఆగ్రహిస్తే నీ మనుగడ కష్టాల మలుపులో కాపురముంటుంది సుమా!" అని వాస్తవికత సుగుణలోని ధైర్యాన్ని హరించి పిరికిమందు పోస్తోంది!

బాగా చదువుకున్న వాడు సంస్కారి కాలేజీ లెక్చరర్ అయిన భర్తన్నా తన బాధని సానుభూతితో అర్థంచేసుకుని తన సమస్యకో పరిష్కారమార్గం చూపించకపోతాడా...?! అని అభిప్రాయపడింది సుగుణ కాని అది గగన కుసుమమే అయింది. చదువు సంస్కారానికి— తల్లంటే పిల్లిలా భయపడటానికి—సంబంధం లేదని తెలుసుకుంది సుగుణ.

రఘు—"అమ్మ అభిప్రాయానికి తిరుగు లేదు. అందులో నాజోక్యం ప్రసక్తేలేదు!" అన్నప్పుడు కన్నీట మున్నీట విలపించింది సుగుణ! ఆ తరువాత అత్త సాధింపులకు పూర్తిగా లొంగిపోయింది... ఏమన్నా ఎదురు తిరిగితే భర్తతో కాపురం చేసుకునే అవకాశం ఉంటుందో ఉండదోనని! అత్తగారి మనస్థితిని దృష్టిలో పెట్టుకుని సినిమాలు షికార్లు అన్నీ మానుకుంది. ప్రపంచంలో ఏదీ తనకు పట్టనట్టుగా వేదాంతిలా కూర్చోటం ... మరీ మనసులో బాధ పెల్లుబికినప్పుడు కన్నీళ్లు జలజలా కార్చటం .. ఆతర్వాత లేని నిద్రలోకి జారుకోవటం అలవాటు చేసుకుంది. అత్త తనమీద ప్రేమ చూపటం లేదని ... బహిరంగంగానే సాధిస్తోందని తెలుసుకున్న రఘు భార్యమీద ప్రేమను తగ్గించేశాడు. మాతృ విధేయుడుకదామరి! లేకపోతే... రేపు ఆస్తంతా ఏ ఆశ్రమం పేరన్నా రాసే

# కనువిప్పు

స్తుందేమోనని తనపని హుళక్కి అవుతుందని అతని భయమేమో?!

ఇక విశాలాక్షమ్మ సంగతి—తనలో తానొక సారి పునర్విమర్శ చేసుకుంది కోడలుగా తననుభవించిన చెరలు ... ఇప్పుడు తన కోడలుగా సుగుణ అనుభవిస్తున్న మానసిక స్థితిని బేరీజు చేసుకుంది. తను — మచ్చలేని కోడలుగా ఇంట్లో అడుగుపెట్టినా అక్రమంగా అన్యాయంగా అమానుషంగా తనను సాధించి బాధించి — భర్తచేత హింసింప జేసింది తన అత్త! కాని అత్తగా తనలా కాదు! కోడలు మంచిదనుకున్నంత సేపూ




ఆమెనందలం ఎక్కించింది! కాని ... తన కోడలు తననుకున్నంత మంచిదేమీ కాదు! తన అందంతో చదువుతో తమను మోస గించి తమయింట్లో అడుగు పెట్టింది ... తన గుండెల్లో నిప్పు పెట్టింది! ఈ రాజుకునే మంటనార్పటం ఎవరితరం? దీనికీ మాధవ రావుగాడికీ నిశ్చయంగా ఏదో సంబంధం ఉండి తీరాలి! లేకపోతే ఇప్పటికి ఏ నాలుగు సార్లో వచ్చాడు వాడు! వాడు వచ్చినప్పు డల్లా ఏదో అనటం ఇది పగలబడి నవ్వటం! పైగావాడు అబ్బాయి రఘు లేనిసమయా ల్లోనే రావటం!! ఇదంతా ఏమిటి?! తనను రఘును సుగుణ వెన్నుపోటు పొడవటం కాదూ? తమకు నమ్మకద్రోహం కావించటం గాదూ? అలాంటి కోడల్ని రాచి రంపాన పెట్టటం నిలువునా చీల్చటం నేరమెలా అవుతుంది? దాన్నింతటితోనే వదలకూడదు! అత్తను మోసం చేసినందుకు తగిన గుణపాఠం నేర్పాలి! కుమిలి కృశించిపోయేట్లు చెయ్యాలి! తను చేస్తున్నపని సముచిత మైనదేనన్న దృఢనిశ్చయానికొచ్చిన విశాలాక్షమ్మ కోడలుమీద తనలోని ఈర్ష్యాద్వేషాలు కోడలు సంకట పరిస్థితికి చాలా వరకు కారణమా? అన్న భావానికి తావివ్వనేలేదు.

ఇంక ముందు కార్యక్రమమేమిటో...! అన్న విషయం మీద ఓ నిర్ణయాని కొచ్చింది విశాలాక్షమ్మ! భార్యగా సుగుణంటే ప్రేమాభిమానాలున్నాయి రఘుకు! అది విశాలాక్షమ్మకు తెలుసు! అందుకనే ... కిలెరిగి వాతపెట్టాలన్నట్టుగా ప్రవర్తించాలనుకుంది.

ఓరోజు మాధవరావు వచ్చి కూర్చున్నా డింట్లో! మాటకారి అవటంవల్ల ... "మా యింటికి రాకు ఫో!" అని విశాలాక్షమ్మ చేత వెళ్లగొట్టించుకునే స్థితిలో ఉండడతను. పైగా విశాలాక్షమ్మకు ముందే నమస్కార బాణం వదులుతాడు! సుగుణను "చెల్లెమ్మా!" అని సంబోధిస్తాడు.

సుగుణ ముఖం వివర్ణంగా ఉండటంవల్ల ఆమె మానసికంగా ఏదో దిగులుగా ఉందని గ్రహించిన మాధవరావు ఆమెను నవ్వించటం తన కనీస కర్తవ్యంగా భావించాడు. జోకుల మీద జోకులు వేస్తూ ... కబుర్లు చెప్ప సాగాడు. హాస్యానికున్న దుర్గుణమే నవ్వించటం గదా! పైగా ఆడదాని నవ్వు నాలుగువిధాల చేటట! అక్షరాలా అదే జరిగింది సుగుణ జీవితానికీ! కాదు...సూత్రధారియై జరిపించింది విశాలాక్షమ్మ!!

సరిగ్గా అదే సమయానికి స్కూటరేసు కుని ఇంటికి వస్తున్న కొడుకును వీథిలోనే అల్లంత దూరాన ఆపి ... నెమ్మదిగా లోనికి తీసుకొచ్చింది విశాలాక్షమ్మ. ఈలోపుగా అతని మనసు విరిగేలా నూరిపోసింది!

"ఏం చెప్పనురా అబ్బాయ్! మన వేలుతో మన కన్ను పొడుచుకున్నట్టవుతుందని ఇన్నాళ్ళు చెప్పలేదు నీకు! ఇలా తరచు జరుగుతుందీ వ్యవహారం! నేనున్నానని గూడా ఖాతరు చేయటంలేదురా! కోడలు ముండ! వాడ్నే మన్నా అంటే — పొగరుగా ఎదురు తిరుగు తాడు. కొట్లాటకు కూడా దిగవచ్చు. అందు

(40వ పేజీ చూడండి)

# పెరిగే ప్రతి దశలోనూ శరీరానికి
# కావాలి
# కాల్షియం-శాండోజ్®



కాల్షియం, గర్భంలోని శిశువు ప్రథమ దశలోనే పాప పళ్ళలోనూ, ఎముకలలోనూ చేరు కోవటం మొదలెడుతుంది. పుట్టబోయే శిశువుకు శీఘ్రగతిలో ఎక్కువగా కాల్షియం కావాలి. అందుకే, మీకు మామూలు కన్న రెండు రెట్లు కాల్షియం కావాలి. మీరు తొందర గానే కాల్షియం-శాండోజ్ తీసు కోవటం మొదలెట్టండి.



పాప ఎముకలు, పళ్ళూ పటిష్ఠత కోసం కాల్షియం లభించేది పాలిచ్చి పెంచే తల్లి ద్వారానే. ఆమెకు మామూలుకన్న మూడు రెట్లు కాల్షియం అవసరం.



పెరిగే పాపకు పటిష్ఠమైన ఎముకలూ, గట్టి పళ్ళ కోసం కాల్షియం ముఖ్యావసరం. అందుకే, పెద్ద వాళ్ళ కన్న, పాపకు కాల్షియం ఎక్కువగా కావాలి!



కాల్షియం ప్రతి దశలోనూ, ప్రతి వయసులోనూ, శరీరానికి కీలకమైన అవసరం. మరి కాల్షియం-శాండోజ్‌లో, కాల్షియం ఉత్తమోత్తమైన రూపంలో ఉంది. రోజుకు రెండు సార్లు, రెండు లేదా మూడు రుచిగల, రాస్ప్ చెరీ-వాసన గల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు, మీకు అవసరమైన కాల్షియం యిస్తాయి. దానితో బాటే విటమిన్ సి, డి మరియు బి$_{12}$.

**శాండోజ్‌ను విశ్వసించండి-ప్రపంచమంతటిలో కాల్షియం తయారీలో అగ్రగాములు.**




## కాల్షియం-శాండోజ్®
## బిళ్ళలు ప్రతి రోజూ ప్రతి వారికీ

dCA/CS/15 F TEL.

# కల్యాణ ఘడియ

## 'సత్యవతీమూర్తి'

*(గత సంచిక తరువాయి)*

'ఫారిన్' వెళ్ళివచ్చిన ఓ పెళ్ళికొడుకు తను మానుకోలేని త్రాగుడు అలవాటు గురించి నిక్కచ్చిగా చెప్పాడు. కారులో దిగిన మరో పెళ్ళికొడుకు సింహాల్లాంటి కుక్కపిల్లలను తెచ్చి తనతో సోఫాలో కూర్చోబెట్టుకున్నాడు. ఆ కుక్కలు వెళ్ళే దాకా ముసలివాళ్ళిద్దరూ నిజంగానే హడలిపోయారు.

పెద్ద ఆఫీసరుగా పనిచేస్తున్న ఒకతను, ఇంట్లో ఏది వండమంటే అది వండాలనీ, ఫార్వర్డుగా వుండగలిగితేనే తాను చేసుకోగలననీ చెప్పాడు.

వస్తున్న సంబంధాల తీరుతెన్నులు గమనిస్తుంటే అందరికీ మతులు పోతున్నాయి. నాలుగయిదేళ్ళ క్రితం తాను అవునంటే చేసుకోవడానికి సిద్ధంగావున్న వాళ్ళందరికీ పెళ్ళిళ్ళయిపోయాయట! అది సరస్వతమ్మగారి బాధ! పద్దెనిమిదేళ్ళకే ఆడపిల్లకి పెళ్ళి చేయడం ఎంత అవసరమో ఇంటికొచ్చిన వాళ్ళందరికీ ఉపన్యసిస్తున్నారు వెంకట్రామయ్యగారు. ఈ గొడవలతో తను నిజంగానే పెద్దదయిపోయినట్లు, బాధపడసాగింది శాంత. అందుకే అలంకరణమీద కూడా శ్రద్ధ హెచ్చింది.

పండుగలకీ, పురుళ్ళకీ పుట్టింటికి వచ్చిన అక్కలూ వాళ్ళూ కూడా తనకి పెళ్ళి కాలేదని జాలి చూపించడం, తనకంటే చిన్నవాళ్ళ పెళ్ళిళ్ళకి ఎప్పుడన్నా వెళ్ళినప్పుడు వినవలసివచ్చే వ్యాఖ్యలూ భరించలేకపోతోంది శాంత.

* * *

ఈసారి శశిరేఖ వచ్చినప్పటినుండీ శాంత మనసులో రవి మెదులుతున్నాడు. అతనేం చేస్తున్నాడో? బహుశా పెళ్ళయివుంటుంది, పిల్లలు కూడానేమో! ఆ! పెళ్ళి అయితే ఎదురింటి మామ్మగారికి తెలీకుండా అవుతుందా? ఆవిడకి తెలిస్తే అందరికీ తెలిసినట్లే. ఆవిడో పెద్ద పబ్లిసిటీ ఆఫీసరుగదా!

తన ఆలోచనలకు తనకే నవ్వు వచ్చేది. రవి మీద ఎక్కడో తన మనసు లోపలి పొరల్లో అభిమానం పెల్లుబుకుతున్నట్లుండేది. మళ్ళీ ఏదో దిగులు! "అతను తనను ప్రేమించి, అర్థించినపుడు తిరస్కరించిన తను, యీనాడు అతనికి జ్ఞాపకమైనా వుంటానా" అని.

రోజూ శశిరేఖ తనతో కబుర్లు చెప్పుకోవడానికి వస్తూనేవుంది. ఒకరోజు అడిగింది శాంత, రవిని గురించి. అతను ఎమ్. ఫారం. ప్యాసై బొంబాయిలో పెద్ద ఫార్మస్యూటికల్ ఫరమ్‌లో పని చేస్తున్నాడనీ, పదిహేను వందలు జీతం అనీ చెప్పింది. ఆనాటి అతని రూపం గుర్తువచ్చింది శాంతకి. పెళ్ళయిందా అన్న ప్రశ్న నోటిదాకా వచ్చికూడా అడగలేక పోయింది శాంత.

ఆరోజు తలంటుపోసుకుని ఏదో పత్రిక తిరగేస్తోంది శాంత. ఎందుకో మనసంతా వుత్సాహంగా వుంది. ఆరోజు తెల్లవారుఝామున తేచేముందు కన్న కల మాటిమాటికీ గుర్తుచేసుకుంటోంది. అందులో తనూ, రవీ... యీ ఆలోచనలు మనసులో ముసురుతున్న సమయంలోనే శశిరేఖ ఇంచుమించు పరిగెత్తుతున్నట్లుగా వచ్చింది. వస్తూనే, "మా అమ్మ నాన్న వారంరోజుల్లో వస్తున్నారు శాంతా! రవిని కూడ వీలైనంత త్వరలో శలవు పెట్టుకుని రమ్మని రాశారుటనాన్న." అంది.

"ఏమిటి విశేషం?" అడిగింది శాంత.

"ఈ ఏడు రవికీ, వీలైతే నాకూ పెళ్ళిళ్ళు చేసెయ్యాలని చాలా పట్టుదలగా వున్నారు నాన్న. అందుకే..."

శాంత మనస్సులో చెప్పలేని ఆందోళన. "ఎలాగైనా పెళ్ళి చేసేస్తారా? అయితే సంబంధాలు ముందు కుదిరేవుంటాయి." మనసులో అనుకుంటున్న మాటలు పైకే వచ్చేశాయి.

"అదేగదా పేచీ! ఏ సంబంధం చూచినా ఏదో వంకపెడతాడు అన్నయ్య. వాడి మనసులో ఏముందో ఏమో!" అని మళ్ళా,

"నువ్వు నమ్ము, నమ్మకపో శాంతా! నాకెప్పుడూ నిన్ను వదినా అని పిలవాలనుంటుంది! నీలాంటి వదిన వస్తే ఎంత బాగుంటుంది!"

ఆ మాటలు శశిరేఖ ఎందుకన్నదోగాని, శాంత గుండెల్లో గంటలు మ్రోగినట్లయింది. రవి ఇంకా పెళ్ళి చేసుకోలేదన్న ఆనందం ఒకవంక— "తెల్లవారుఝామున కలవస్తే నిజమవుతుందంటారట..." అనిపించిందామెకు. పైకిమాత్రం, "ఛీ! ఫో! అవేం మాటలు?" అంది కోపం నటిస్తూ.

"నీకు బాధ కలిగిస్తే క్షమించు శాంతా! నిజమే ... మీరు గొప్పవాళ్ళు ... అలా అనడం నాదే పొరబాటేమో..." యింకా ఏదో అనబోతున్న శశిరేఖను చూస్తుంటె ఆమెకు ముద్దొచ్చింది.

"ఛ! ఛ! నేనలా అనలేదు శశీ! నిజంగా నీ మాటలు నాకు సంతోషమే గలిగించాయి, నమ్మవూ?" బుజ్జగించింది. కాస్సేపుండి మళ్ళా,

"అయినా నీ పిచ్చిగానీ, మీ అన్నయ్యకు నేను జ్ఞాపకమైనా వున్నానో లేదో ... యీసారి నువ్వు ఉత్తరంరాస్తే నేను మరీ మరీ అడిగానని రాయి."

"తప్పకుండా రాస్తానొదినా!" అంటూ తుర్రుమంది శశిరేఖ.

శాంతకు మనసెంతో ప్రశాంతంగా అయిపోయింది. ఏదో నూతనోత్సాహం పెల్లుబుకుతోంది మనసులో. రవి రాసిన మాటలు జ్ఞాపకం వస్తున్నాయి. నిజంగా ఏ దేవతలయినా కరుణిస్తున్నారా! అతని ప్రేమ అంత బలమైనది కాకపోతే ఇన్నాళ్ళూ ఒంటిగా వుండిపోతాడా! తనకోసమేనా ఆ నిరీక్షణ? ఆ ప్రశ్న ఉదయించినపుడు మాత్రం పరీక్షకి వెళ్ళబోతున్న విద్యార్థినిలా ఆందోళన చెందసాగిందామె.

* * *

వారం పదిరోజుల్లో వస్తాడనుకున్న రవి మూడురోజులు తిరిగేసరికి అక్కడ దిగాడు.

ఆరోజు ఆదివారం సాయంత్రం శశిరేఖ వచ్చి శాంతని వాళ్ళింటికి రమ్మని బ్రతిమాలడం మొదలెట్టింది.

"పోనీ వెళ్ళకూడదామ్మా! ఆ అమ్మాయి అంతగా పిలుస్తుంటేనూ!" అంటూ ప్రోత్సహించింది సరస్వతమ్మ.

* * *

"మా అన్నయ్య, పేరు రవి." అంటూ పరిచయం చేసేదానిలా చెప్పసాగింది శశిరేఖ.

"మాకు తెలుసులేవోయ్! నీ పరిచయాలూ, నువ్వూను" అన్నాడు రవి. "క్యారమ్స్ ఆడుకుందాం" అని ఇద్దర్నీ కుర్చీలమీద కూర్చోబెట్టి, "కాఫీలు తెస్తా" నంటూ లోపలి కెళ్ళింది శశిరేఖ. వాళ్ళిద్దరే అక్కడ. కొద్ది క్షణాల నిశ్శబ్దం తరవాత రవి,

"శాంతా! నేను గుర్తున్నానా? నామీద కోపం లేదుకదా?"

సిగ్గు ముంచేస్తుంటె, అతి కష్టంమీద మాట్లాడింది శాంత,

"మీమీద కోపమా! ఎప్పుడూ లేదు. ఉంటే మీకే వుండాలి నామీద కోపం."

"నేనింతవరకూ పెళ్ళి చేసుకోకుండా ఎందుకుండిపోయానో, ఇంకా ఎన్నాళ్ళయినా ఇలాగే వుండిపోవాలని ఎందుకు నిర్ణయించుకున్నానో చెప్పినా నువ్వు నమ్మవేమో!" శాంత మొహంలో వేయి దీపాల వెలుగు చూస్తూ అన్నాడు రవి,

"శశి రాసిన వుత్తరం చూసి ఏమనిపించిందో తెలుసా? అయిదేళ్ళ క్రితం పెట్టుకున్న దరఖాస్తుకి ఇంటర్వ్యూ పిలుపొచ్చినట్లు..."

ఆనందం మనసు నిండిపోగా, ఏం మాట్లాడాలో తోచక,

"ఇంకా నామీద ... మీకు..."

"ఎంత ప్రేమ వుందో, అది ఎలా పెరిగిందో, చెప్పాలంటే చాలకాలం పడుతుంది. బహుశా ఒక

రాజమండ్రి మాత్రు కళా కేంద్రం వారు మే 9న హైదరాబాదు ఆంధ్రపత్రిక కార్యాలయంలో శ్రీ వేంకటేశ్వర సుప్రభాత చిత్ర కళా ప్రదర్శన నిర్వహించారు. రాజమండ్రి నివాసి, అక్కడే చిత్రకళని అభ్యసించిన శ్రీ శ్రీపతి శ్రీధర్ మాత్రు కళా కేంద్ర సంస్థాపకులు. 28 కళాఖండాలుగా సుప్రభాత శ్లోకాలని మనోజ్ఞంగా వీరు చిత్రీకరించారు. వీరి కుమారులు జనార్దన్, సత్యనారాయణ, బాలసుబ్రహ్మణ్యంలు సుప్రభాతం శ్లోకాల్ని చెపుతూ వాటికి వేదాంత, లౌకికపరంగా వున్న అర్థాల్ని కళాఖండాల్లో ఎలా చిత్రీకరించినదీ వివరించారు. ఈ ఫొటో ఆ సందర్భంలో తీసినది. దేశం అంతటా వీరి ప్రదర్శనలు నిర్వహించబడినాయి. [ఫొటో : శ్రీధర్]

జీవితం చాలదు. అందుకే జన్మ జన్మలకీ నీకోసం నేను...''

శాంత హేండ్ బ్యాగ్‌లో నుంచి ఒక పాత కాగితం తీసి రవి చేతిలో పెట్టింది. అది రవి రాసిన పాత ఉత్తరం. అది అందుకొంటుంటే రవి మొహం వెలిగిపోయింది.

''శాంతా! నేనెంత అదృష్టవంతుణ్ణి? యింతకాలం నా వుత్తరం నువ్వు దాచివుంచావన్న తలపు మాత్రాన యీ అయిదేళ్లుగా నేను పడ్డ బాధ మర్చిపోగలను.'' అన్నాడు.

''నన్ను క్షమించండి! యిన్నాళ్ళ మీ ప్రేమని గుర్తించలేని దురదృష్టవంతురాలిని'' అంది శాంత.

''మనం గుర్తించడం ముఖ్యంకాదు శాంతా! ఎంత ప్రేమని దైవం గుర్తించాడు. అందుకే యిలా కలిపాడు.''

శశిరేఖ కాఫీకప్పులతో ప్రవేశించింది, ''ఏమిటి, గుసగుసలాడుకుంటున్నారు?'' అంటూ.

రవి నవ్వుతూ, ''ఏంలేదు శశీ! నీగురించే ఆలోచిస్తున్నా. మరి, నీకు శాంతలాంటి వదిన వస్తే ఎంత బాగుంటుందీ? అందుకని..''

''ఆ! అందుకనీ...'' యేమీ తెలీనిదానిలా బుగ్గమీద చెయ్యి నొక్కుకుంటూ అడిగింది.

''మరి మనం ఎలాగూ యీ విషయాలు డైరెక్టుగా అమ్మకో, నాన్నకో చెప్పలేంకదా! అందుకని నువ్వు ముందుగా బామ్మ చెవిలో వేశావనుకో...'' శశి అందుకుని, ''ఆవిడగారి పబ్లిసిటీతో రెండిళ్లల్లోని పెద్దలూ మేలుకుని, కార్యసన్నద్ధులవుతారన్నమాట! అంతేనా శాంతమ్మా! ఎంత నేర్చినావమ్మా?'' అంది నాటకపక్కీలో.

శాంత సిగ్గుతో రెండు చేతులతోనూ మొహం కప్పేసుకుంది.

త్వరలో

## బాంధవ్యాలు

సీరియల్





# కౌటిల్య

### మంథా వేంకట రమణారావు

*(గత సంచిక తరువాయి)*

''ఇలా బెదిరిస్తారనే నాన్నని తెచ్చేను...''

''ఏడీ నీ నాన్న ... ఎక్కడున్నాడు?''

''మీ కలక్టర్ దగ్గరకి వెళ్లి మాట్లాడుతున్నారు. పెళ్లాన్ని పుట్టింట వదిలి మీరిక్కడ ఒక వెలుగు వెలిగిస్తున్నారని చెప్తున్నారు. నన్ను వీధినపెడితే మీ ఉద్యోగం ఊడుతుంది. అదయ్యేక మా బావ ఇండస్ట్రీలో గుమస్తాగా చేరక తప్పదు...''

ఆవేశంతో ఆమెని కొట్టేడు. ఆవేశం తగ్గే వరకూ ఆమె తన్నులుతింది. తరువాత ఆపింది. ఆమె మూకరాజుకన్నా రెండు అంగుళాల ఎత్తు. మంచి పుష్టయిన విగ్రహం. అతడి చేతులు పట్టుకుంది గట్టిగా ... ఆమెని కొట్టడంవల్ల అతడి చెయ్యే నొచ్చింది. ''మీ కోపం తగ్గిందికదా? ఇంక ఆపండి ... లేపోతే...''

''ఏం చేస్తావ్?'' అరిచేడు. ''పైన నాన్న వున్నారు యిద్దరు పోలీసు జవాన్లతో...'' చల్లగా చెప్పింది. ''కలక్టర్ యింటికి వెళ్లేడన్నావ్?'' ''ఇద్దరం కలిసే వెళ్లేం. నన్ను చంపే ధైర్యంకల మగాళ్లేమోనన్న భయంతో బందోబస్తుతోనే వచ్చేం.'' అంతలో మామ ప్రవేశం. ''కోపం తగ్గిందా అల్లుడూ? చూడు ... నువ్వేదో అపోహ పడ్డావు... పేరుకి బావేకాని శ్రీధర్ అన్నలాటివాడు దానికి ... వాడికే ఇద్దాం అనుకుంటే అమ్మాయే ... 'చూడు నాన్నా ... బావని ఎప్పుడూ అన్నలానే చూస్తూవచ్చేను...మరోలా చూడలేను...' అంది... ఒక శుభవార్త నీకు...కలక్టరున్నాడే?... నా ఫ్రెండు కొడుకు. నీమీద మంచి అభిప్రాయం వుంది...నీకు ఆర్. ఐ. పోస్టు రాబోతోంది ... నీ పేరు వెళ్లింది మీదకి ... నీకు అమ్మాయిమీద వుత్తరాలు రాసిన వాళ్లే నీమీద పుల్లలు పెడతారు ... రహస్యంగా వుంచు వచ్చేవరకూ ... ఇంక నీ పెళ్లాం నీదగ్గరే బుద్ధిగా పడివుంటుంది ... ఏమే పన్నగం ... ఏమంటావ్...?'' ''అలాగే నాన్నా! నేనెప్పుడన్నా అతని మాట కాదన్నానేమిటి?'' అందామె. ఆ దెబ్బతో పూర్తిగా ఓడిపోయేడు మూకరాజు. మనస్సులోనే ఏడ్చేడు. ఎవరు వినేవారు?

ఆ రాత్రి మరో శుభవార్త చెప్పింది ... తనకి (పన్నగానికి) నాలుగోనెలట! పుట్టింటికి వెళ్లి వుండి నాలుగు నెలలయింది. ఇక్కడ బయట వున్నాకే వెళ్లింది. నాలుగోనెల కుండవలసిన లక్షణాలు లేవు. కడుపు ఎత్తుగా లేదు! ఏడో నెల

అని చెప్పి, మూడు నెలల తరవాత పుట్టింటికి వెళ్లి పోయింది. వెళ్లిన నాలుగు నెలల తరవాత పిల్లడు పుట్టి పోయినట్టు ఒక కార్డుముక్క వచ్చింది... అంగ వైకల్యంతో పుట్టినవాడు పోవడమే మంచి పనయింది. తరవాత తెలిసింది... బైట ఉండడం ఆగగానే వాళ్ల బావ సాయంతో నాటుమందు లేవో మింగింది కాని లాభం లేకపోయిందనీ... దాని ఫలితం మాత్రం ఇది అనీ. తన కింత వేగం కాన్పులు ఇష్టంలేక చేసేనని మరో అబద్ధం ఆడింది ఆరోపణ వేస్తే.

అబద్ధాల బతుకయింది తనది... అన్నీ విషంలా మింగలేకా కక్కలేకా బాధపడాల్సి వచ్చింది... తన ఏడుపు ఎవరు విన్నారు?... మరి పిల్లలు కలగలేదు. ఏళ్లు గడిచేయి. తన హోదా పెరగడంతో పన్నగం తన పడగ దించేసుకుంది. తనకి కాపలాదారిణిగా తయారయింది... మనస్సుని అర్థం చేసుకొని తనని ప్రేమించగలిగే కోమలి కోసం మనసు కోమల మౌతుంది... ఆ లోటు భార్య తీర్చలేనపుడు వేరు బాట వెతుక్కుంటే మగాడి తప్పేం ఉంది?

కాని ఈ ఓబులయ్య? రంభలాటి పెళ్లాన్ని కీలుబొమ్మలా వాడి చంపేసేడు... మరో ఆమెని పెళ్లాడి ఆమె తిరగబడితే, మరో స్త్రీని పెళ్లాడేడు. ఈ ఓబులయ్యలా తనెందుకు కాలేకపోయేడు భార్య విషయంలో? పన్నగాన్ని గుప్పెట పెట్టుకో లేకపోతున్నాడెందుకు? ఈ ఓబులయ్యకి తనని చూస్తే వెటకారం. పెళ్లాం దగ్గర నూకరాజు 'నూకే' అని ఎన్నోచోట్ల జోకు వెయ్యడం తనకి తెలుసు. రెండో ఆట పిక్చరు చూపుతాడు ఉ... అంటే ఇతడే చాకచక్యం ఉన్నవాడు... ఇతడు మాపిస్తేనే తనకి సినిమా చూసే యోగం ఉంటుం దనుకుంటున్నాడు. ఓబులయ్యని చూస్తే ఒళ్లు మండుతుంది, వాడి ఆత్మవిశ్వాసానికి. వీడికి దన్ను ఆ అహోబలంగాడు! అందుకే తను వచ్చేక ఒక అరగంట తరవాత మీసాలు కీటుకుంటూ వచ్చేడు ఓబులయ్య. ధీమాగా కూర్చున్నాడు. సంతకం పెట్టక ఎక్కడికి పోతావ్ అన్న ధీమా. అహోబలం గాడికి కలక్టర్ దగ్గరా, మంత్రుల దగ్గరా పలుకు బడుంది. గడ్డిపోచలా తనలాటివాడిని ఊదీగలడు. "వేగం సంతకం పెట్టు" అన్నట్టు చూస్తున్నాడు.

- రామన్నతో నూకరాజన్నాడు ... "చెప్పనన్నా చెప్పు! ఏడవన్నా ఏడు! రెండూ చెయ్యకు!"

రామన్న ప్రక్కని సింహాద్రిని చూసేడు. కుర్రాడి కళ్లు బాగున్నాయి. చురుకైనవాడిలా కనిపిస్తున్నాడు. తన కొడుకు బతికివుంటే ఈసరికి కాలేజిలో చేరివుండును. "నీకొడుకా?"

"ఔను మాపెబో! నాకొడుకే! పేరు సింహాద్రి...ఏదన్నా అపచారం చేసుంటే చమించాలి! పడరా దొరగారి కాళ్లమీద!" సింహాద్రిని నొక్కి నేలమీద పడుకోబెట్టేడు. సింహాద్రికి అయ్యమీద కోపమొచ్చింది.

"సరే లెమ్మను ... కుర్రాడు చురుకైన వాడే ... బడిలో వేసేవా?" ఆ మాటలంటూ ఓబులయ్యని క్రీగంట చూసేడు. బోనులోపడ్డ ఎలకలా ఓబులయ్య మనసులో కొట్టుకోడం గ్రహించేడు నూకరాజు. 'వీడి మొహంమండ!

**జరిగిన కథ 3:** తాత తండ్రుల కాలం నుంచి తమ పొలం సాగుచేస్తున్న రామన్నను పొలం విడిచిపెట్టమంటాడు బుగత. బుగత ఫిర్యాదుపై తాసిల్దారు నుంచి పిలుపు రాగా కొడుకు సింహాద్రితో వెళతాడు. రామన్న. తమ కులంవాళ్లని అందరూ ఎందుకిలా చిన్నచూపు చూస్తారో అర్థం చేసుకోలేకపోతుంది సింహాద్రి చిన్న వయసు. అధికారం వున్నంతవరకే తనకీ, తన మాటకీ విలువనే నగ్నసత్యం గ్రహించిన తహసిల్దారు నూకరాజు ముందు తను ఆ తర్వాతే మిగిలిన వారు అనే మాత్రం పాటిస్తుంటాడు. గుమస్తాగా వున్నపుడు పన్నగమణితో పెళ్లవు తుంది నూకరాజుకు. తను గుమాస్తా అన్న చిన్న చూపుతో అందకుండా వున్న పన్నగమణి వాళ్ల బావతో తిరుగుతూండటంతో వెళ్లి పొమ్మంటాడు నూకరాజు.

కేసు తేల్చక కుశలప్రశ్నలు వేస్తున్నాడే' అని అనుకున్నాడు ఓబులయ్య.

"దరమపెబువులు! మాకు సదువులేల దొరా? ఏదో యిలా ఎల్లిపోతే సాలు..."

"ఈ భూమిని ఎన్నాళ్లయి సాగుజేస్తున్నావు?"

"నాను పదోళ్లోడ్నయినప్పట్నించి దొరా!"

"అంటే ఇరవైఏళ్లయింది...అంతకుముందు నీ అయ్య ... నీ తాత దున్నేవారా?"

"సిత్తం దొరా!"

"ఎన్నేళ్లయి?"

"ఏబై అరవై ఏళ్లవుతాది దొరా!"

"వాళ్ళు, అంటే యీ బుగత తండ్రి, తాతా, నీ తండ్రినీ, తాతనీ మంచిగా చూసేవారా?"

"మంచిగా నూసుకొనేవోరు దొరా! మా కట్టం వుంచుకోనేదు!"

"మంచిగా చూసుకోడం అంటే ఏమిటో చెప్పు?"

"నాలుగు బాగాల్లో, ఒక బాగం పంట మాకొదిలిపెట్టేవోరు దొరా!"

"గింజలకీ, నీ తిండికీ అదే ధాన్యమా?"

"నాకు పొరికూడేల దొరా? ఆ ధాన్యం అమ్మితే దొరికిం డబ్బుతో సోళ్లు కొనుక్కొని ఆంబలి రెండుపూట్లా తాగుతే సాలు..."

"నాగలి, ఎడ్లు ఎవరివి? నీవా బుగతవా?"

రామన్న ఓబులయ్యవేపు చూసేడు. ఓబులయ్య కోపంగా అన్నాడు ... "చెప్పరా! అలా నాకేసి చూస్తావేం? చెప్పు!"

"బుగతవే దొరా!" నీరసంగా అన్నాడు. ఓబులయ్య చిరునవ్వు నవ్వేడు.

ఇది అబద్ధమని నూకరాజుకి తెలుసు. ఇది ప్రతి రామన్న విషయంలోనూ జరుగుతున్నదే. ఓబులయ్య తాత, యీ రామన్న తాతకి ఒక ఎడ్ల జత, ఒక క్రరనాగలీ యిచ్చి దున్నమన్నాడు. ఆ ఎడ్లూ, నాగలీ తిరిగి బుగతకి అప్పచెప్పే బాధ్యత దున్నేవాడిది. అవి పోతే వాడే అచ్చుకోవాలి. ఆ ఎడ్లజతలు ముసలివయి చచ్చేయి ... నాగళ్లు అరిగి విరిగేయి ... వాటికి బదులుగా కొత్తవి కొనడం జరుగుతూనే వచ్చింది. రామన్న, రామన్న తండ్రీ, తాతా కనీసం నాలుగుజతల ఎడ్లు కొనివుంటారు... నాగళ్లు కొనివుంటారు స్వంత డబ్బుతో ... కాని అవి బుగతవాటికిందే లెక్క. ఎందుకంటే మొదట యిచ్చిన ఎడ్ల జత, నాగలి యింకా వాపసుకాలేదు... తిరిగి అప్పజెప్పబడలేదు ... కొత్త ఎడ్ల జత కొన డానికి తాత చేసిన అప్పు అలా వుండేవుంది... ఆ అప్పు బుగత యిచ్చిందే ... దానిమీద వడ్డీ. బుగత యొక్క వంశాని కెప్పుడూ రామన్న వంశం ఋణపడే వుంటుంది. ఆ ఋణం యెప్పుడూ తీరనిది. అంతటా జరుగుతున్నదే యిది అని నూకరాజుకి తెలుసు.

"నువ్వు రోజుకి ఎన్నిగంటలు పనిచేస్తావు?" తాసిల్దారు, నూకరాజడిగేడు.

"సీకటుండగానే పొలంకెళ్తే, సీకటిపడ్డాక యింటికొస్తా దొరా!"

"బువ్వ తింటాని కింటికి రావా?"

"రాను దొరా? అక్కడికే నా బారియ తెస్తది..."

"నీ భార్య పొలంమీద పనిచేస్తుందా?"

"సిత్తం దొరా!"

"ఆదివారం మీకు సెలవుందా?"

"దొరా! బూమి దున్నడానికీ, పంట పండించ డానికీ సెలవేటి? మనింట్లో పని మనల్ జేసు కుందుకి సెలవుంటదా?"

"అంటే బుగత భూమిని నీ భూమి అయినంత ప్రేమగా చూసుకుంటున్నావన్నమాట..."

"సిత్తం! ఆ బూమే నా తల్లి దొరా!"

"సెలవు లేకుండా, రోజుకి పధ్నాలుగు గంటలు, సంవత్సరానికి మూడు వందల అరవై నాలుగు రోజుల చొప్పున్నా నువ్వూ, నీ తండ్రీ, నీ తాతలూ కనీసం ఏబై ఏళ్లనించీ ఆ భూమిని సాగుచేసుక వచ్చేరన్నమాట?"

"సిత్తం దొరా! అదే సత్తెం!"

నూకరాజు కుర్చీకి చేరబడి మరొక సిగరెట్టు తీసి వెలిగించేడు. గట్టిగా దమ్ములాగి, పొగ వదిలి ఓబులయ్యకేసి చూసి అడిగేడు: "రామన్న చెప్పిన దాంట్లో ఏమన్నా తప్పులుంటే దిద్దండి!"

ఓబులయ్యకి ఒళ్లు మండుతోంది... ఈ కంబారి వెధవ చెప్పినదాంట్లో ఏవో ముఖ్యాంశా లున్నట్టు మాట్లాడతాడేమిటి? "ఏముంది దిద్ద డానికి? భూమిని దున్నుతున్నట్టు చెప్పేడు. అందులో ప్రత్యేకతేముంది?" చిరాగ్గా అన్నాడు...

నూకరాజు తల పంకించేడు... "ఇందాక మీరన్నారు... మీ భూమి మీద కూలీని మీరు మాన్పించలేరా అని?"

"ఔను..."

"రామన్న కూలీ అనా మీ అభిప్రాయం?"

"వాడు వెట్టిచాకిరీ చేసేవాడు... కూలివాడి కన్న తక్కువ..."

"రామన్నకి మీరు ఇచ్చే జీతం ఎంత? రోజు వారీ ఇస్తారా, నెలవారీయా... లేక..."

"పంటలో ఒక భాగం ఇస్తాము."

"ఎన్ని పంటలు పండుతాయి?"

"ఏడాదికి రెండు..."

# కౌలువు

''రెండు పంటల మధ్యకాలంలో రామన్నని ఎందుకు మాన్పించరు ?''

''అదెలా కుదురుతుంది ? భూమిని, ఆవుని పోషించినట్టు పోషించాలి – ఆవు ఒట్టిపోయిందని దాని పోషణ మూడమా ?''

''అంటే, రామన్నని ఏడాదల్లా, ఒక్క రోజు కూడా నాగా లేకుండా గత ఇరవై ఏళ్లుయి వాడుకుంటున్నారు...''

''ఔను... నే నెప్పుడూ కాదనలేదే ?''

''కూలీని పనిలోంచి తొలగించవచ్చున్న మీ హక్కుని ఎప్పుడన్నా వాడేరా ?''

''అంటే ?'' ఆశ్చర్యపోతూ అడిగేడు ఓబులయ్య.

''అంటే, ఏ పని చెయ్యడానికన్నా, టెంపరరీగా మనుషుల్ని నియమించినప్పుడు ఆరు నెలలకి ఒకసారి తీసేస్తూ ఉంటారు. కనీసం ఒక్క రోజన్నా తీసేస్తారు... ఆ పని వాడికి ఆ ఉద్యోగంమీద ఏ హక్కులూ లేవని చట్టరీత్యా చెప్పడానికి. ఒకవేళ ఆ పనివాడు రెండు వందల నలభై రోజులకన్న ఎక్కువ ఉండే ఏడాదిలో, ఆ పనిమీద వాడికి కొన్ని హక్కులొస్తాయి...''

''వాడి నెప్పుడన్నా నేను పనిలో వేస్తేగదూ తీసెయ్యడానికి ? తాసిల్దారు ఉద్యోగ మనుకున్నా రేమిటి వాడిది? వెయ్యబడడానికీ, తియ్యబడడానికీ?'' నీ ఉద్యోగం జాగర్త అన్న హింటిచ్చేడు ఓబులయ్య...

ఆ హింటు గ్రహించేడు నూకరాజు, ఆహాబలం గాడ్ని చూసుకొని వీడు కూస్తున్నాడే... కుయ్యి... కుయ్యి !

''అబ్బే అలా అనుకోలేదు. మీరు చెప్పిందాన్ని బట్టి మీరు ఒప్పుకుంటున్న సంగతి ఇది... అదేమిటంటే, రామన్న, వాడి తండ్రి, వాడి తాత, మీ భూమిని కూలీగా దున్నలేదు...''

''ఔను...'' అనుమానంగా ఒప్పుకున్నాడు... ఓబులయ్య.

''కూలీగా దున్ననప్పుడు వారు ఆ భూమిని రైతులుగా దున్నేరని తేలుతోంది...'' చిరునవ్వు నవ్వేడు నూకరాజు.

ఉలికిపడ్డాడు ఓబులయ్య. చురచురా చూసేడు. ''అదేమిటూ కొత్తమాట? రైతేమిటి?''

''భూమిని కౌలుకి తీసుకొని దున్ని, పంటలు పండించి, భూకామందుకి పంటలో కొంత భాగం అద్దె కింద ఇచ్చేవాడు రైతు ! మీరు రామన్నని కూలీగా నియమించలేదుగా ?''

''వ్రాత మూలకంగా నియమించలేదన్నాను ! కాని మీరిలాటి విపరీతార్థాలుతీస్తారని అనుకోలేదు '

''పోనీ కూలీగానే... మీరన్న కంబారిగానే ఉన్నాడనుకుందాం ! ఒక్క రోజాన్నా నాగా లేకుండా మూడు వందల అరవై నాలుగూ ఇంటూ ఇరవై, రోజులు పనిచేసిన కంబారికి వాడి పనిమీద ఏ హక్కులూ ఉండవనే అంటారా మీరు?'' నూకరాజు ఓబులయ్యకేసి సవిలాసంగా చూసేడు. నువ్వు గాజులు తొడిగించుకున్న, నోరులేని ఆడవాళ్ల ముందు



పులివే కాని ఇక్కడ నా ముందు కాదయ్యా సరసుడా. నాతో వ్యవహారం ఆడదానితో సరసాలాడినట్టు కాదు. పెళ్లాన్ని హింసలు పెట్టి ఉరి తీసుకొని చావమన్నట్టు కాదు... రా...రా... వలలోకి రా తండ్రీ... అంటున్నాయి నూకరాజు విలాసద్రుక్కులు.

''మీరలా అనడం సబబుగా లేదు !'' కోపం అణచుకొంటూ అన్నాడు.

''నేను అనడంలేదు. మీ అభిప్రాయం అడుగుతున్నాను. ఇంక కూలీలలోకూడా, మస్టర్‌రోల్, కేష్యువల్, టెంపరరీ, సెమీపెర్మనెంట్ అని ఉంటారు... అలానే సీజనల్ లేబర్ కూడా ఉంటారు. వీళ్లకైనా వారానికొకరోజు శెలవుంటుంది. నెలవారీ కూలీ అయితే జీతంతో శెలవుంటుంది... ఒక ఏడాదికిపైగా పని చేస్తే వాడికి కొన్ని హక్కులొస్తాయి... అందువల్ల, ఇరవై ఏళ్లుయి, ఒక్క రోజన్నా నాగా ఉండకుండా మీ భూమిని చూస్తున్న రామన్నకి మీ భూమిని దున్నుకుందుకి హక్కు ఉందని మనం ఒప్పుకోవాలి కదా ?'' చాలా మృదువుగా గొంతుపెట్టి అడిగేడు నూకరాజు.

''అయితే ఏ భూకామందుకీ అతడి భూమి దక్కదు !'' బుసబుసా పొంగేడు ఓబులయ్య.

''దక్కక ఎక్కడికి పోతుందేం ?''

''దున్నేవాడిపాలు అవుతుంది !''

''ఇపుడు దున్నేవాడి అధీనంలో లేదా భూమి? మీరు వెళ్లి దున్నుతున్నారా ?''

''భూకామందుకి దానిని అమ్మే హక్కు లేదంటారా ?''

''ఆ మాటన్నారు బాగుంది ! మీరు భూమిని అమ్ముదామని చూస్తున్నారా ?'' నూకరాజడిగేడు.

''ఔను !''

''ఎవరికి ?''

''ఎవరికయితేనేం ? నాకీ భూమి అక్కర్లేదు! అమ్మేస్తాను !''

''అమ్మేయండి ! ఎవరు ఆపగలరు మిమ్మల్ని? హాయిగా అమ్మేసుకోండి ! మీ భూమిని అమ్మేసుకోవచ్చు అని మీ కాగితంమ్మీద రాసేస్తాను...'' తేలికగా అని చిరునవ్వు నవ్వేడు నూకరాజు.

''మీకు తెలిసే అంటున్నారా ?''

''మీ భూమిని మీరు అమ్ముకోవచ్చని తెలిసే అంటున్నాను...''

''ఆ సంగతికాదు నే అన్నది. రామన్న ఆ భూమిని కాళీ చెయ్యందే కొనేవాడు కొనడని మీకు తెలిసే అంటున్నారా ?'' అసలు సంగతి బయట పెట్టేడు ఓబులయ్య.

ఆ సంగతి నూకరాజుకి తెలుసు. రామన్న భూమి కాళీచేస్తే. దానిమీద మామిడితోటవేస్తాడు కొన్నవాడు ... అదే, పెద్దకాపు. తోటలో వున్న భూమి 'ఆర్చార్డ్' కింద వస్తుంది ... సీలింగ్ పరిమితిలోకి రాదు ... దాని లెక్క వేరవుతుంది, అందువల్ల యిటు అమ్మేవాడికీ, అటు కొనేవాడికీ అడ్డుగా గోడలా వున్నది యీ రామన్నే...

''దానికి నేనేం చెయ్యగలను చెప్పండి ?'' విచారం వ్యక్తపరిచేడు నూకరాజు.

(29వ పేజీ చూడండి)

# * సినిమావిశేషాలు *



'భక్త కన్నప్ప'లో కృష్ణంరాజు

### రైలుబండి గడబిడ

అది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్. ఆ ట్రెయిన్‌లో మంజుల, ఆమె ఫ్రెండ్ ప్రయాణం చేస్తున్నారు. ఫ్రెండ్స్ ఇద్దరూ హుషారుగా, హాపీగా వున్నారు. మంచి మూడ్‌లో వున్నారిద్దరూ. మంజులతో తన లవ్ స్టోరీస్ చెబుతూ, ఆమెలో క్రొత్త వుత్సాహాన్ని కల్గిస్తూంది ఆమె ఫ్రెండ్. సఖి మాటలు వింటూ సరదాగా, సంబరంగా ఫీలవుతూంది మంజుల. మధ్యలో విరామం. అంటే మంజుల ఫ్రెండ్ బర్త్‌పై కెక్కింది (నిద్రకోసం) మంజుల ముఖం కడుక్కోవడానికని టాయిలెట్ కెళ్లింది.

సరిగ్గా ఈ సమయంలోనే పల్లెటూరినివాసి శోభన్‌బాబు ఈ ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో ఎక్కేసాడు. చడీ, చప్పుడు లేకుండా దుప్పటి కప్పుకుని కునుకు మొదలెట్టాడు. ఇంతలో మంజుల తిరిగొచ్చింది. ముసుగు బిగదన్ని పడుకున్నది తన ముద్దుల చెలి అని భ్రమించి, సెచ్చెలి చెప్పిన ప్రేమ సూత్రాలను నెమరువేసుకుంటూ, శోభన్‌బాబును తన మెత్తటి మేని స్పర్శలతో కలవరపెట్టింది. ఈ హఠాత్ సంఘటనకు విభ్రమచెందాడు శోభన్. తత్తరపాటుతో లేచాడు. బెడ్‌పై వున్న శోభన్ను చూచి బెంబేలుపడింది మంజుల. ఆపై ఏం జరిగింది ? చెబితే థ్రిల్ పోతుంది. అందుకే అది సస్పెన్స్‌లో పెడుతున్నాను.

శోభన్ ఎవరు ? మంజుల ఎవరు ? శోభన్ పట్నానికి ఎందుకు పయనమైనట్లు ? వీరిద్దరి రైలుబండి పరిచయం ఎందాకా వెళ్లింది ? ఈ ప్రశ్నలకు సమాధానమే విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి "మొనగాడు" వర్ణచిత్రం. టి. త్రివిక్రమరావు నిర్మించిన ఈ రంగుల చిత్రానికి టి. కృష్ణ దర్శకుడు. టి. ప్రద్యుమ్నరావు నిర్మాణ నిర్వాహకుడు.

శోభన్ ద్వయం రెండు విభిన్న పాత్రల్లో కన్పించే ఈ చిత్రంలో రాజబాబు, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, కాంతారావు, అల్లు రామలింగయ్య, శ్రీధర్, సాక్షి రంగారావు, అంజలీదేవి, జయసుధ, రోజారమణి, శశిరేఖ ముఖ్య తారాగణం. "ష్యామ" సంగీతం, సత్యానంద్ సంభాషణలు, జి. కె. రాము ఛాయ, కుదరవల్లి కళ సమకూర్చారు. లక్ష్మి విడుదల.

### అక్కినేని ఎలా వుండాలి

పునర్జీవితుడై, రంగప్రవేశం గావించిన "నటసామ్రాట్" ఎలా వుండాలి అని ప్రజలు ఆశిస్తున్నారంటె ... గ్లామరస్‌గా వుండే పాత్రలను, పేదరికం కనిపించని పాత్రలను, గంతులేసే పాత్రలను, శృంగార ఘట్టాలు ఎక్కువగా వుండే పాత్రలను పోషించాలనెడి ప్రేక్షకుల కోర్కెను శిరసావహించడానికి అక్కినేని సంశయించకూడదు.

అమెరికా వెళ్లిన రోజున, నేను (తన మనవరాలిని చూడడంకోసం) ఆ మహానటుడితో ప్రేక్షకుల మాటను తెలియచేశాను.

"ఎవరి ఆదరణతో యింత వాడ్నయ్యానో, అట్టివారి మనోభావాన్ని గౌరవించే బాధ్యత నాపై వుంది", అన్నారాయన.

మరో సంవత్సరానికి, అన్నపూర్ణా స్టుడియోస్ "అందాల ఆలయం" అవుతుందన్నారాయన.

### ఎవరయినా ఒకటే

స్వర్గీయ ఘంటసాల స్థానాన్ని భర్తీచెయ్యగల వాయిస్ యీ జన్మలో జరగని పని గాబట్టి, ఎవరు పాడినా ఒకటే అనెడి అభిప్రాయాన్ని అక్కినేని వ్యక్తపరచారు.

బాలసుబ్రమణ్యం, రామకృష్ణ తనకు బంధువులు కారని, నిర్మాతలు ఎవరిచేత పాడించినా, తనకు అభ్యంతరం వుండదని ఆయన అన్న మాటలు అక్షరాలా నిజం అనిపించాయి.

ప్రేక్షకుల టేస్టు మారుతున్న కాలానికి అనుగుణంగా వున్నట్టే, మార్పును కోరే ప్రజలకు నచ్చే పాత్రలను చెయ్యడంలో తృప్తి, ఆనందం వుంది అని అక్కినేని అంగీకరించారు.

తను సినిమా రంగంలో అడుగుపెట్టిన లగాయితు, యిన్ని చిత్రాలను అంగీకరించడం జరగలేదన్న నిజాన్ని అక్కినేని ఒప్పుకున్నారు.

### అమెరికాలో ఎన్నాళ్ళు

అక్కినేని మే 11 న అమెరికాకు మదరాసు నుంచి బయల్దేరారు. అక్కడ ఎన్నాళ్ల వుంటారో తెలుసా ?

నెలరోజులు వుంటారు. తరువాత మరో పదిరోజులు లండన్‌లో వుంటారు. తన మనవరాలు చిరంజీవి సుప్రియతో ముద్దు ... ముచ్చట్లు చెయ్యడం కార్యక్రమంలోని ప్రధాన అంశం.

మే 11 నుంచి జూన్ 24 వరకు అమెరికా, లండన్, ఫ్రాన్సు మున్నగు ప్రదేశాలను పర్యటించి, జూన్ యిరవై అయిదున స్వదేశానికి వచ్చేవిధంగా ప్రోగ్రాము ప్లాన్ చేశారు.

విదేశయానం పూర్తి అయిన వెంటనే "మహాత్ముడు" చిత్రం షూటింగులో పాల్గొంటారు.

"మహాత్ముడు" వర్ణ చిత్రం షూటింగు మే 14 నాటికి యిన్‌డోర్ పూర్తయిన నిజం పాఠకులకు తెలుసు.

"నటసమ్రాట్...ఊర్వశి" పాల్గొనే మూడు పాటల చిత్రీకరణ ఊటీలో జరిగితె, "మహాత్ముడు" పూర్తయినట్టే.

'నేరం నాదికాదు ఆకలిది'లో మంజుల, ఎస్.వి.ఆర్.





## నందమూరి మానవతావాదం !

పూర్వాచారాలు బాగా పాతుకుపోయిన గ్రామం అది. మూఢనమ్మకాలు దృఢంగా నాటుకుపోయిన మోటు ప్రజలకు నివాస స్థలం ఆ గ్రామం. ఆ గ్రామ మహిళాలోకంలోని ఒక మగువే ప్రభ.

ప్రభ పెడదారి పట్టినట్లు, ఆడదానికి ఆభరణమైన శీలాన్ని పోగొట్టుకున్నట్లు ఆవూరి ప్రజలు ఆరోపణ చేసారు. అలాంటి కళంకిని వూర్లో వుండకూడదని, ఏ మాత్రం దయ, దాక్షిణ్యం లేకుండా, ఆమెపై దారుణంగా రాళ్ల వర్షం కురిపించారు. ఈ అమానుషం అప్పుడే ఆ వూరి ప్రాంగణంలోకి ప్రవేశించిన నటరత్న కంటబడింది. ఆపండి! అకృత్యాన్ని అంటూ ఆవేశంగా పలికి, ప్రభను అపాయంనుండి అడ్డుకున్నారు. వివేకాన్ని, వివేచనాన్ని మేలుకొలుపే మాటలతో వార్ని వూరడించారు. అర్థంలేని ఆవేశం అనర్థానికే దారితీస్తుందని ప్రభోదిస్తూ యీ క్రింది పాటను పాడారు.

"మంచిని సమాధి చేస్తారా ! ఇది మనుషులు చేసే పనిఏనా ! మనలో పాపం చేయనివాడు ఎవడో చెప్పండి ! ఏ దోషం లేనివాడు ఎవరో చూపండి" అంటూ వారి వేగిరపాటును, పొరబాటును సరిదిద్దారు. సి. నా. రె. వ్రాసిన యీ పాటను నటరత్నకుగానూ బాలు పాడాడు. (సత్యం సంగీత సారధ్యంలో.)

రవి చిత్ర ఫిలిమ్స్ బ్యానరు క్రింద వై. వి. రావ్ నిర్మిస్తున్న "నేరం నాదికాదు – ఆకలిది" వర్ణ చిత్రంలో హృదయాన్ని కదిలించే సన్నివేశాల్లో పై సన్నివేశం ఒకటి. ఎస్. డి. లాల్ దర్శకత్వం, గొల్లపూడి రచన, దేవరాజ్ కెమెరా, చలం కళ, బాలు కూర్పు సమపాళ్లలో సమ్మిళితమై పై చిత్రాన్ని రసవత్తరంగా తయారు చేసాయి. కర్నాటకంలోని కెమ్మన్‌గూండే ప్రాంతంలో యీ చిత్రానికిగానూ భయంకర పోరాటాలు షూట్ చేసారు. ఈ చిత్రంలో ఫైట్స్ ఒక ప్రత్యేక ఆకర్షణ. పూర్ణా రిలీజ్.

## అగ్రనటి అమెరికా వెళ్తుందా?

"మహానటి"గా అగ్రనటిని అంగీకరించే సంస్కారం అందరికీ వుంది. ఆమె "నటన"లోని "యిది" అందరినీ ఆకర్షిస్తుంది. 'క్వీన్ ఆఫ్ ఆల్ రసమ్స్' అని వాణిశ్రీని పేర్కొనే ధైర్యం యీ విలేఖరికి వుంది.

"సెక్రటరీ" చిత్రంలో వాణిశ్రీ నటన సుపర్బ్‌గా వుంటే, "ఆరాధన" చిత్రంలో ఆమె నటన అద్వితీయంగా వుంది.

ఈమధ్య ఆమెను "పొగరుబోతు" సెట్లో కలిశాను. ఆమె ఆటోగ్రాఫ్ కోసం ఆ రోజు వచ్చినవారి సంఖ్య వందపైగా వుంటుంది.

మీరు అమెరికా వెళ్తారట అని నే నడిగాను.

"అవును. జూన్... జులై మాసాల్లో అలా... అలా వెళ్లిరావాలని వుంది", అందావిడ.

## రష్యా ట్రిప్ "రద్దు"

'మే'లో పెట్టుకున్న రష్యా ట్రిప్‌కు 'గుడ్‌బై' కొట్టడానికి కారణం చెప్పింది. తాష్కెంట్‌వరకే 'పాస్‌పోర్టు' వుండడంవల్ల, తాననుకున్న ప్రదేశాలను చూడడం సాధ్యపడని కారణంగా, క్యాన్సిల్ చేయాల్సి వచ్చిందన్న నిజాన్ని ఆవిడ వెల్లడించింది.

## సిమ్లా విడిది !

ఈసారి వేసవిని అక్క కాంతమ్మ, బావ రాజుగారు, వారి పిల్లలతో 'సిమ్లా'లో గడపడానికి వాణిశ్రీ నిర్ణయించింది.

మదరాసులో 110 డిగ్రీల ఎండను సంభాళించడం అసాధ్యమైన విషయం. అందుకే, హిల్ స్టేషన్‌కు వెళ్లడానికి నిర్ణయించింది.

## కొత్త చిత్రాలు !

రవిరాజ్ కంబైన్స్‌కు, శ్రీ ఆంజనేయ చిత్రకు, శంకరరెడ్డిగారికి, మహీజా ప్రకాశరావుగారికి, కృష్ణవేణిగారికి వాణిశ్రీ తన అంగీకారాన్ని తెలిపింది.

## వైవిధ్యం వున్న పాత్రలు

రాబోయే చిత్రాలలో అగ్రనటి పాత్రల్లో ఎంతో వ్యత్యాసం, వైవిధ్యం వున్న నిజాన్ని ప్రేక్షకులు వొప్పుకుంటారు.

"భక్త కన్నప్ప"లోని పాత్రకు, "పొగరుబోతు"లోని వేషానికి ఎంత తేడా వుందో, గజానన చిత్రవారి పాత్రకు, కె. ఎస్. ప్రకాశరావుగారి "సుప్రభాతం"లోని పాత్రకు అంత వ్యత్యాసంవుంది.

ప్రేక్షకులు ఆశించే పాత్రలను ఎంపిక చేసుకోవడంలో అగ్రనటికి సాటి ఆమే అవుతుంది. ఆమెను పెట్టుకునే నిర్మాతలు కూడా, ప్రేక్షకుల టేస్టు కనుగుణంగానే పాత్రలను సృష్టిస్తుంటారు.

ఎట్టి పాత్రకయినా ప్రాణం పొయ్యగల శక్తి వాణిశ్రీకి వున్న వాస్తవాన్ని ప్రజలు వొప్పుకుంటున్నారుగాబట్టే, పరిశ్రమలో ఆమెది పైచేయిగావుంది.







'పొరుగింటి పుల్లకూర'లో మురళీమోహన్, జయచిత్ర

# సినిమా

## సైకిల్ సరసం

జయచిత్ర, మురళీమోహన్ భార్యాభర్తలు. వీరిది ప్రేమ పెళ్లి. ఇద్దరూ కొన్నాళ్లు సాఫీగా, హాపీగా సంసార జీవనాన్ని సాగించారు. జయచిత్ర మనస్తత్వం విచిత్రమైనది. నెరవేరని కోరికలను గూర్చి పదే పదే నెమరువేసుకుంటూ, కోరి కట్టుకున్న మొగుడిపై అడపదడప అలుకబూనేది. అందరి భర్తల్లాగే తన భర్త కూడా దర్జాగా, దర్పంగా తిరగాలని ఆమె ఆశ. కానీ మురళీమోహన్ అందుకు విరుద్ధం.

అహర్నిశలు అర్ధాంగి ప్రక్కన చేరి వామన గుంటలు ఆడుదామా లేక వలపు కథలు చెప్పుకుందామా అంటూ కాలం గడిపేవాడు. అందరిలాగే అలా కాసేపు బయటి కెళ్లకూడదూ అంటూ భర్తను బలవంతపెట్టేది చిత్ర. ఆమె బలవంత పెట్టేకొద్దీ, ఆమెను గిలిగింతలు పెట్టాలని ప్రబలాటపడేవాడు మోహన్.

ఒకనాడు భార్యామణి కోరికపై షికారు కెళ్లడానికి నిశ్చయించుకున్నాడు మోహన్. సైకిల్ వాహనముగా, తన శ్రీమతిని తోడుగా తీసుకుని పిల్లవాయువులు పీల్చడానికని బయల్దేరాడు. పడుచు పెళ్లాన్ని కళ్లెదుట పెట్టుకుని ఏ మగాడు వూరుకుంటాడు ? చిలిపిచేష్టలతో వుడికిస్తూ యిలా, యిలా పాడసాగాడు.

మోహన్ : "రాజును చూసిన కన్నులతో
మొగుణ్ణి చూస్తే చులకనలే
పొరుగింటి పుల్లకూర
ఎంతో రుచిగా వుండునులే."

చిత్ర : సరి సరి సరి సరి తెలిసెను, తెలిసెను."

మోహన్ : "సైకిల్ సవారి బాగుందా
సరదా యిప్పుడు తీరిందా
రెండు చేతుల సందున
నలుగుతువుంటే బాగుందా."

చిత్ర : మరి మరి అడగకు తెలిసెను, తెలిసెను.

మోహన్ పాడిన పాటకు పరవశిస్తూ, ప్రణయ సామ్రాజ్యంలో పయనిస్తూ కాంతిరేఖలా మెరిసిపోసాగింది చిత్ర. ఇలా కాసేపు వివాదం, కాసేపు వినోదం, కాసేపు విహారంతో విచిత్రంగా సాగిపోయే పై శృంగార సన్నివేశం హరిప్రసాద్ కంబైన్స్ వారి "పొరుగింటి పుల్లకూర" చిత్రంలోనిది. ఎ. హనుమంతరావు నిర్మించిన యీ చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు.

## జయచిత్ర చిత్రాలు ఎన్ని

ప్రస్తుతం జయచిత్ర తెలుగులో నటిస్తున్న చిత్రాలు ఎన్నన. 'నటరత్న'గారి సరసన నటిస్తున్న తెలుగు "దో ఆంఖే బారా హాత్" వర్ణ చిత్రం.విక్టరీ దర్శకత్వంలో రానున్న "పొరుగింటిపుల్లకూర".

రామకృష్ణ ప్రక్కన నటిస్తున్న "స్వర్గానికి నిచ్చెనలు" ఒకటి.

సృజన చిత్ర తలపెట్టిన (కె. ఎస్. రామిరెడ్డి దర్శకత్వం) చిత్రం మరొకటి.

కె. హేమాంబరధరరావు దర్శకత్వంలో మహేంద్ర నిర్మిస్తున్న చిత్రం యింకొకటి.

దాసరి నారాయణరావు దర్శకత్వంలో నిర్మితమయ్యే "ఇదెక్కడి న్యాయం" చిత్రం వేరొకటి.

హీ—మాన్ శోభన్‌బాబుతో రెండు వర్ణచిత్రాలు.

ఈ సంచిక పాఠకులు చదివే రోజుకు ఏడు చిత్రాలు లెక్కకొస్తాయి.

## అందరిదీ ఒకే మాట

ఈమధ్య ఆంధ్రదేశం వెళ్లినప్పుడు, షుమారు పదిమంది ఎగ్జిబిటర్లను జయచిత్ర భవిష్యత్తును గూర్చి ప్రశ్నించాను. అందరిదీ ఒకే మాట.

ప్రేక్షకులు జయచిత్ర పట్ల అభిమానం వర్షించడానికి సుముఖంగా వున్నారని, వాణిశ్రీ అంతటి నటిగా జయచిత్రను అంగీకరిస్తున్నారని, సమాధానం యిచ్చారు.

జయచిత్రకు ఏ వేషం యిచ్చినా చెయ్యగలరన్నీ "సోగ్గాడు, యవ్వనం కాటేసింది" చిత్రాలు ఋజువు చేశాయని ఎగ్జిబిటర్లు అన్న మాటలు ఆధారరహితమైనవి కావు.

ఆడియన్స్ అనుకునే మాటల్నే వాళ్లు అన్నారు.

## తెలుగులో గురుదత్ చిత్రం

స్వర్గీయ గురుదత్ నిర్మించి, నటించిన ఒక ఉత్తమ చిత్రాన్ని తెలుగులో నిర్మించే వుద్దేశ్యం, హరిప్రసాద్ కంబైన్స్ అధినేత హనుమంతరావుకు ఏర్పడింది.

ఆ చిత్రం యొక్క ప్రింటును సమత ఆర్ట్స్ అధినేత చటర్జీ తేవడానికి బొంబాయి వెళ్లారు.

ఆ చిత్రంలో యిద్దరు హీరోయిన్లు నటించారు. ఒకరికి ఆ చిత్రం హిందీ రంగంలో పెద్ద మలుపును తెచ్చిపెట్టిందికూడా.



'స్వామి ద్రోహులు'లో రామకృష్ణ, విజయలలిత

శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైసెస్




మహత్తరప్రేమ సన్నిధికి లాక్కుంటుంది
దూరంగానూ త్రోసివేస్తుంది
సుమధురమైన ప్రేమకు
సున్నితమైన రూపకల్పన





నిర్మాత క్రాంతికుమార్
దర్శకత్వం కె.రాఘవేంద్రరావు

## బంగారక్క

రవి శంకర్ పిక్చర్స్ (బలిపీఠం) తలపెట్టిన ఉత్తమ చిత్రం పేరు యిది ఈ చిత్రానికి కథ, మాటలు, చిత్రానువాదం దాసరి సమకూరుస్తున్నారు స్టార్ డైరెక్టర్ (నారాయణరావు) యీ చిత్రానికి దర్శకుడు

హైద్రాబాద్ సారథీలో ఇన్‌డోర్ షూటింగు, అక్కడి ప్రాంతాల్లో అవుట్‌డోర్ షూటింగు జరపడానికి, నిర్మాత సునీల్ చెవుదరి నిర్ణయించారు

ఈ చిత్రంలో శ్రీదేవి నాయికగా నటిస్తూంది ఇతర పాత్రలను మురళీమోహన్, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రమాప్రభ పోషిస్తున్నారు

ఆంధ్రులు మెచ్చిన 'మామ' ''బంగారక్క'' చిత్రానికి సంగీత దర్శకుడు శ్రీ ఫిలింస్ విడుదల

## శ్రీదేవి బలే చేసింది

''బంగారక్క'' చిత్రంలో శ్రీదేవి నాయిక కావడానికి కారణం లేకపోలేదు ''పాడవోయీ భారతీయుడా'' చిత్రంలో శ్రీదేవి బలేగా చేసిందన్న నమ్మకం దాసరికి ఏర్పడిన పర్యవసానమే ''బంగారక్క''లో శ్రీదేవి రావడం సంభవించింది 'శ్రీదేవికి మాంచి యూత్ వుంది రిథమ్ సెన్స్ వుంది చెపితే వెంటనే అర్థం చేసుకుని చెయ్యగల టాలెంటు వుంది'' అన్న అభిప్రాయం దాసరికి ఏర్పడింది

దాసరి నమ్మి ప్రోత్సహించినవారందరూ యీనాడు ప్రేక్షకుల ఆమోదాన్ని అందుకుంటున్నవారే మురళీమోహన్, ఈశ్వరరావు, మోహన్‌బాబు, అన్నపూర్ణ, జయలక్ష్మి, మాడా మొదలగువారు

చేయించుకునే శక్తి దర్శకుడికి వుండాలిగాని, ఎవర్నయినా ఉత్తమ నటులుగా తీర్చిదిద్దడం అదేమంత పనికాదని నారాయణరావు నిరూపిస్తున్నారు

## డ్రైవింగ్‌లో లవింగ్ !

ఆరోజు హాస్యరాజు రాజబాబు హీ-మాన్ శోభన్‌బాబుకు కార్ డ్రైవింగ్ నేర్పుతుంటాడు స్టీరింగ్ ముందు కూర్చొని కారు వంకరటింకరగా డ్రైవ్ చేయడం మొదలెట్టాడు హీ-మాన్ అలా వంకరటింకరగా డ్రైవ్ చేస్తూనే చెడిపోయిన కారు వద్ద కంగారుపడి నిలుచున్న మంజుల దగ్గరకెళ్లి, లిఫ్ట్ యిస్తా రమ్మని పిలుస్తాడు వన్నెకాడు, అందుకుతోడు వలచినవాడు రమ్మని పిలుస్తుంటే కాదనగలదా ! సందేహం లేకుండా సంతోషంగా వచ్చి హీ-మాన్ ప్రక్కన కూర్చుంది అతనలా వంకరటింకరగా డ్రైవ్ చేయడం చూచి, నవ్వుతూ, యిలా వెక్కిరించసాగింది

మంజుల ''డబ్బాకారు అబ్బాయిగారూ,
అబ్బో అబ్బో ఏం జోరూ''

ఆ వెక్కిరింతకు సమాధానంగా -

శోభన్ కుర్రకారు అమ్మాయిగారూ
కొరకొర చూస్తే కంగారూ
ఇప్పుడిప్పుడే మెల్లమెల్లగా నేర్చుకుంటున్నా
ఇంతలోనే పరీక్ష పెడితే నెగ్గగలనా''

అంటూ పాడుకుంటూ కార్ డ్రైవింగ్‌కు తిన్నగా స్వస్తిచెప్పి, ముద్దుగుమ్మ మంజులతో చేరి శృంగార సముద్రంలోకి ప్రవేశించాడు శోభన్ మెత్తగా, సుతిమెత్తని మంజుల శరీరాన్ని హృదయానికి హత్తుకుంటూ, సరిహద్దులేని ఎత్తులకు ఎగిరిపోయారు యిద్దరూ ఊటీలోని సుందరప్రదేశాల్లో ప్రమోదంగా, ప్రశాంతంగా గడిపారిద్దరూ

# సినిమా

ఈ యిద్దరికీ సంబంధం ఎలా కుదిరింది, ప్రేమబంధం ఎలా పెరిగింది అనే సందేహాలకు సమాధానంగా విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ వారి 'మొనగాడు'' వర్ణచిత్రం టి కృష్ణ దర్శకత్వంలో ముస్తాబై వస్తూంది టి త్రివిక్రమరావు నిర్మిస్తున్న యీ చిత్రానికి ట ప్రద్యుమ్నరావు నిర్వహణ లక్ష్మి విడుదల



[illegible]రాజా వెడలె'లో జయసుధ

## [illegible] సంపత్

[illegible] నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచనగారి మరొక ప్రసిద్ధ నవల ''మిస్టర్ సంపత్ ఎం ఏ'' ను, అట్లూరి హనుమంతరావు కొని, చిత్రావసరమైన మార్పులను, చేర్పులను ఆచార్య ఆత్రేయ చేత చేయించారు

విక్టరి మధుసూదనరావు దర్శకత్వంలో మార్చి 14 న ప్రారంభమయ్యే, ''మిస్టర్ సంపత్'' వర్ణ చిత్రంలో శోభన్‌బాబు, లక్ష్మి, జయప్రద, రావుగోపాలరావు, రాజబాబు ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు

ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ మాటపాటలను రాస్తున్నారు (దీన్నొక హిట్ చిత్రం చెయ్యాలన్న దృఢ సంకల్పం ఆత్రేయగారికి ఏర్పడింది )

సంగీతానికి చక్రవర్తి, ఛాయాగ్రహణానికి వెంకటరత్నం, కూర్పుకు సంజీవి, కళకు కృష్ణారావు ఆధిపత్యం వహిస్తున్నారు లక్ష్మి ఫిలింస్ విడుదల

## ఓ మనిషీ తిరిగిచూడు !

దాసరి కథ, మాటలు రాసి, దర్శకత్వం నిర్వహిస్తున్న మరొక సంచలన చిత్రమే ''ఓ మనిషీ, తిరిగిచూడు'' ఈ చిత్రాన్ని దిడ్డి శ్రీహరిరావు నిర్మిస్తున్నారు

భాగ్యనగరంలో రెండు షెడ్యూల్సు పూర్తయినట్టు, నిర్మాత చెప్పి, హైద్రాబాదులో షూటింగు మరింత ఆనందదాయకంగా వున్నదని వ్యక్తపరిచారు

''పల్లెసీమ మన భాగ్యసీమరా'' అనే అంశంపై అల్లబడిన కథ ''ఓ మనిషీ, తిరిగిచూడు''

ఈ చిత్రంలో మురళీమోహన్, మోహన్‌బాబు, ఈశ్వరరావు, నిర్మల, కే విజయ, పేకేటి ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు

దాసరిగారి చిత్రంలో పని చెయ్యడం మహద్భాగ్యంగా భావిస్తూంది, కె విజయ తనకు అవకాశం యిచ్చిన శ్రీహరిరావుగారికి కృతజ్ఞతలు తెలుపుతూంది

## నరనారాయణ !

ఉత్తమ చిత్రాలను నిర్మించే మంచి సంస్థగా భాస్కర చిత్రకు గుర్తింపు వుంది ఈ ఏడు విడుదలయిన చిత్రాలలో అత్యధిక ప్రజాదరణ పొందిన ''ఆరాధన'' చిత్రాన్ని భాస్కర చిత్ర నిర్మించింది

ఆత్మవిశ్వాసం, కార్యదీక్ష బలంగా గొన్న నిర్మాత పుండరీకాక్షయ్య యీ తూరి పౌరాణిక కథను ఎంపికచేశారు

చిత్రం పేరు ''నరనారాయణ'' ఈ వర్ణ చిత్రానికి కొండవీటి వెంకటకవి తన కలం బలాన్ని సమకూరుస్తున్నారు

ప్రతి చిత్రానికి సంభాషణలు రాసేప్పుడు, హంపీకి వెళ్లడం పుండరీకాక్షయ్య ఆనవాయితీగా పెట్టుకున్నారు నరుడుగా నారాయణుడుగా సమాన బలాఢ్యులు నటించడానికి సుముఖంగా వున్నట్టు తెలుస్తూంది

## ఇరవైలో యిదొక్కటి

''ఎవర్‌గ్రీన్ హీరో'' ఒప్పుకున్న చిత్రాలు యిరవై అని పాఠకులకు తెలుసు ఆ యిరవైలో ఒకటి భీమేశ్వరరావు దర్శకత్వం వహించేది

## శీను బుజ్జి కంబైన్స్ !

1977 లో అక్కినేని నాగేశ్వరరావుతో అన్నపూర్ణా స్టుడియోస్‌లో చిత్రం నిర్మించే శీను బుజ్జి కంబైన్స్‌కు అనకాపల్లి అప్పారావు అధినేత అని, దర్శకుడు భీమేశ్వరరావు చెప్పారు

జగపతి రాజేంద్రప్రసాద్, బాపు, విశ్వనాథ్ గార్లకు సహాయ దర్శకుడుగా అనేక చిత్రాలకు పని చేసిన భీమేశ్వరరావు అంటె, అక్కినేనికి బలే యిష్టం భీమేశ్వరరావులో ఉత్తమ దర్శకుడయ్యే లక్షణాలు వున్నాయిగాబట్టే, నాగేశ్వరరావు ఆయనకు అంగీకరించడం జరిగింది

## భాగ్యనగరంలో చిత్ర నిర్మాణం

గత ఆరేడు మాసాల నుంచి భాగ్యనగరంలో తెలుగు చిత్ర నిర్మాణం చురుకుగ సాగుతూంది అన్నపూర్ణాస్టుడియోస్‌లో''సెక్రటరీ,మహాత్ముడు'' చిత్రాలషూటింగులు పూర్తయినవెంటనే, మూర్త్యశ్రీ పిక్చర్స్ వారి షూటింగుప్రారంభమైంది

'స్టార్ డైరెక్టర్' దాసరి చిత్రాలు ''తూర్పు పడమర, ఓ మనిషీ, తిరిగిచూడు'' నిర్మాణం పూర్తయిన నిజం ప్రేక్షకులకు తెలుసు

రామకృష్ణ సినీ స్టుడియోస్ జూన్ నాలుగున కార్యరంగంలోకి వస్తూంది మరోప్రక్క సారథీలో రవి శంకర్ పిక్చర్స్ వారి ''బంగారక్క'' చిత్ర నిర్మాణం జరుగుతూవుంది

ఇప్పుడున్న పరిస్థితిని పరికిస్తే, త్వరలో తెలుగు చిత్ర రంగం భాగ్యనగరంలో ప్రముఖ స్థానం వహించగలదన్న నమ్మకం కలుగుతూంది

శ్రీనివాస్

రామన్న ఒక నెలలోపున భూమిని వదిలిపెట్టి పోవాలని మీరు ఆర్డరు వెయ్యాలి ఇరుపక్షాలనీ విన్నారుకదా ?" అవసరం అయితే ఇన్నేళ్ళూ పని చేసినందుకు రామన్నకి వందరూపాయలు ముట్ట చెప్పడానికి నాకు ఏ అభ్యంతరమూ లేదు !"

తాసిల్దారు నూకరాజు భుజాలెగరేసి నిర్లిప్తంగా నవ్వేడు "ఏ రూలు ప్రకారం రామన్న, నెల లోపున భూమి వదిలిపెట్టాలని ఆర్డరు వెయ్య మంటారు ? మీకింద భూమి వున్నంతవరకూ, రామన్నకి మీ భూమిని సాగుచేసే హక్కుంది అమ్మేస్తామంటారూ ? అమ్మేయండి ! అమ్మేసేక ఆ కొన్నవాడూ, రామన్నా మాట్లాడుకుంటారు కొత్త ఒప్పందానికొస్తారు మీకూ దానికీ ఏ సంబంధమూ వుండదు "

"మళ్ళా మొదటికే వస్తున్నారు ? 'వేకెంట్ పొజెషన్' ఇవ్వందీ ఇల్లెవడన్నా కొంటాడండీ ? అద్దెకున్నవాడితోసహా యిల్లు అమ్మగలరా ?" కోపంగా అన్నాడు ఓబులయ్య

"అంటే రామన్న మీ భూమిని అద్దెకి తీసుకున్నాడంటారా ?" శ్రద్ధ చూపిస్తూ అడిగేడు నూకరాజు

ఓబులయ్య సహనం ఒక్కసారిగా ముక్క లయింది విసురుగా లేచి కేకలు వేసేడు 'ఇందులో మీరు ప్రవర్తిస్తున్న వ్యవహారం ఏమీ బాగులేదు న్యాయం నా పక్షాన ఉన్నా ఎందుకో నామీద మీరు పగబట్టి నాకు న్యాయం జరగకుండా చూస్తున్నారు మీమీద మీ పై అధికార్లకు నేను కంప్లేంటివ్వవలసి వస్తుంది మీ ఆట లేమిటో నేనూ చూస్తాను ! అహోబలరావు సంగతి తెలుసు కదూ ? ఈ రామన్నలాంటి వాళ్ళని వందమందిని ఉప్పుని ఊదీగలను !"

అందరూ స్థబ్దులయ్యేరు రామన్నకి మూర్ఛ వచ్చినట్టయింది దొరమీదే మరో దొర కోపంతో పోరు జేసుకోడం వాడింతవరకూ కని విని ఎరుగడు 'తాసిల్దారు దొర నాయం సెప్తానంటూ ఉంటే, ఈ చిన్నబుగత దొర పనికిరాదంటున్నాడు !"

"మీ పేరు అహోబలరావా ?" తాసిల్దారు నూకరాజు చిరునగవుతో అడిగేడు

"కాదు ! నా పేరు ఓబులయ్య !" విసురుగా అన్నాడు

"మరి అహోబలరావు సంగతి నాకెందుకు తెలియాలి ?"

"ఎందుకు తెలియాలో తరవాత తెలుస్తుంది ! సెలవ్ ! వస్తాను !" ఆ మాటలంటూ విసురుగా వెళ్ళబోయేడు ఓబులయ్య

కాని ఒక కర్కశమైన కంఠం విని ఆగి పోయేడు ఈ కంఠం పదును వజ్రంకత్తిలా ఉంది కఠోరంగా ఉంది "ఆగండి ఓబులయ్యా !"

అదిరిపడి, ఆ గొంతు వినవచ్చిన దిక్కుగా చూసేడు అది నూకరాజు నించి వచ్చినదే కాని లతడి గొంతులా లేదు అతడి ముఖంలో ఇదివరకటి చిరునవ్వు లేదు అధికార శక్తితో ముఖం హుందా గానూ, భయం పుట్టిస్తూనూ ఉంది

"మిమ్మల్ని అరెస్ట్ చేస్తున్నాను కదలకుండా అక్కడ నిల్చోండి !" తాసిల్దారు సింహంలా గర్జించేడు శిలాప్రతిమలా ఉండిపోయేడు ఓబులయ్య

# కొలువు

(23వ పేజీ తరువాయి)

లతడి గొంతు ఒక్కసారిగా పడిపోయింది

"ఎరెస్టా ? ఎందుకు ? ఇదెక్కడి జులుం ?" పాలిపోయిన ముఖంనించి నీరసంగా వచ్చేయి మాటలు

"ఒక ప్రభుత్వ ఉద్యోగిని బెదిరించి మీకు అనుకూలమైన పని చెయ్యమన్నందుకు, దర్యాప్తు జరుగుతూ ఉండగానే, అడిగిన ప్రశ్నలకి జవాబివ్వక తూలనాడి, అవమానించినందుకు !"

"మీ కెవరిచ్చేరు పవర్సు ? నన్ను నిర్బంధించే శక్తి మీకు లేదు !"

ఇప్పుడు మళ్ళా చిరునవ్వు నవ్వేరు తాసిల్దారు "నాకు ఫస్ట్ క్లాస్ మేజిస్ట్రేట్ కుండే పవర్సున్నాయని మీకు తెలీదేమో నేను ఎక్కడ కచేరీ చేస్తే అదే కోర్టుగా వ్యవహరించబడుతుంది నా పని సక్రమంగా జరుపుకుందుకి నా శక్తిని ఉపయోగించడంలో ఏమీ అడ్డు లేదు నాకు !"

"మీరు ఫోర్సు ఉపయోగిస్తున్నారు ! తరవాత ఎవారిస్తారు !"

'నాకెప్పుడూ నా పని సక్రమంగా చేసు కొందుకు విచారం వుండదు మీరు ఫోర్సు ఉపయోగిస్తే, నేనూ అదేపని చెయ్యక తప్పుతుందా ? మీలాటి ప్రతివాడూ బెదిరించేసరికి నేను అదిరిపోతే నేను యీ పోస్ట్లో వుండి లాభం ఏమిటి ? ఏయ్ ! వెంకన్నా !" అంటూ కేకవేసేడు నూకరాజు

"చిత్తంసార్ !" యీసారి వెంకన్న దొర దగ్గర చనువు ప్రదర్శించలేదు భయభక్తులతో చేతులు కట్టుక నిల్చున్నాడు

"పోలీస్ స్టేషనుకి వెళ్ళి సబ్ఇన్స్పెక్టరునీ, యిద్దరు జవాన్లనీ కేకేసుకురా, నే చెప్పేనని హేండ్ కఫ్స్ తెమ్మను "

"చిత్తం సార్ !" వెంకన్న, దగ్గర్లోనే వున్న స్టేషన్కి పరుగుతీసేడు

ఓబులయ్య నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు 'నన్ను ఎరెస్ట్ చేస్తారా ? నాకు బేడీలు వేస్తారా? ఏమిటిది ?"

"మీ అహోబలరావు దగ్గరికి బెయిల్కోసం కబురుచేస్తారా ? అతను మీకు బెయి లివ్వడానికి వస్తే అతన్నీ ఎరెస్ట్ చేస్తాను ! మీకోసం కాదా కుర్చీ నిల్చోండి ! స్టేండప్ !" కరకుగా అన్నాడు

ఓబులయ్య కొక్కసారిగా ముఖం తిరిగింది ముందుకు దబ్బున పడబోయి తమాయించుకొని, నిల్చోలేక, కటిక నేలమీద కూర్చుండిపోయేడు

కొంతసేపటివరకూ మాటలు పెగల్లేదు ఓబులయ్యకి ఆఖరికి నీరసంగా అన్నాడు "తప్పయింది నాది క్షమించండి !"

నూకరాజు ముఖంమ్మీదికి చిరునవ్వు క్షణకాలం వచ్చి మాయమయింది

"ఆడవాళ్ళముందు ప్రగల్భాలు పలికినట్టు కాదయ్యా ఓబులయ్యా, నూకరాజుతో వ్యవహారం ఇది నీ హీరోగిరీ నీ ముండల దగ్గర చూపు తాసిల్దార్ నూకరాజు పెళ్ళాం నూకరాజుని ఎడం కాలో తంతుందని ప్రచారం చేసేవ్ కదూ ? నువ్వూ ఓ తాపు తందామనుకున్నావ్కదూ ?" అని మనసులో అనుకున్నాడు నూకరాజు

"మాటలతో కాదు యీ కాగితంమ్మీద రాసి యివ్వండి చేసిన తప్పు ఒప్పుకుంటాను క్షమించమని కోరండి " కాగితం, కలం ఇచ్చేడు నూకరాజు వణికే చేతులతో, ఫైలు ఒత్తుకి తీసుకొని ఎపాలజీ లెటర్ రాయ నారంభించేడు ఓబులయ్య

నూకరాజు ఆర్ ఐ ని చూసేడు అతడు ఒణుకుతూ వచ్చి చేతులు కట్టుకు నిల్చున్నాడు

"నేను వెంటనే వెళ్ళిపోవాలి శ్రీకాకుళం వెళ్ళే బస్సు ఏదన్నా వుంటే కబురుచెయ్యండి !"

'చిత్తం సార్ !" జారే పంట్లాన్ని సర్దుకుంటూ ఆర్ ఐ పొడుతీసేడు

"సబ్-ఇన్స్పెక్టర్కి రానవసరం లేదని చెప్పండి !" నూకరాజన్నాడు

"చిత్తం ! చిత్తం !" ఆర్ ఐ యమ స్పీడ్లో వెళ్ళేడు

"రామన్నా !" నూకరాజు పిలిచేడు

"సిత్తం దొరా !" వణుకుతూ ముందుకు వచ్చేడు రామన్న

"ఆ భూమిని నువ్వు దున్నుకుందుకి ఏ అడ్డూ లేదు ! దానిని అమ్మేసినా, దానిని నువ్వే దున్నుకోవచ్చు నువ్వు దున్నుకున్నంతకాలం దాని మీద తోట వెయ్యడానికి వీలులేదని ఆర్డరు వేస్తున్నాను !"

రామయ్య సాష్టాంగపడి 'దరమ పెబు వులు ! తమ ఋణం తీర్చుకోలేను మా ప్రెబో ! నన్నూ నా కుటుంబాన్నీ రచ్చించినారు !" వలవలా ఏడ్చేడు

"లేరే అబ్బాయీ ఇలారా !" దొరగారు సింహాద్రిని పిలిచేరు

రామయ్య గమ్మున లేచి, సింహాద్రిని ముందు కీడ్చి, "ఎల్లరా ! పెబువులు పిలుత్తున్నారు !" అన్నాడు

నూకరాజు ముఖం ఇప్పుడు ఎంతో ఆకర్ష వంతంగానూ, ఎంతో శక్తివంతమైనదిగానూ సింహాద్రికి కనిపించింది "చిన్నబుగత వొణికిపోనాడే! దొరసానా మంచోడు !" అనుకున్నాడు దొర దగ్గరగా వెళ్ళి పాదాలకి మొక్కి "దొండం దొరా !" అన్నాడు చిన్నగొంతుతో

"మంచిది మంచిది అయ్య చెప్పినట్టు విని, బుద్ధిగా చదువుకో ఇదుగ ఈ మిఠాయి, పళ్ళు ఇంటికి తీసుకెళ్ళి తిను మీ అమ్మకియ్యి " అంటూ పొట్లాలలో, తినగా ఇంకా ఎక్కువగా మిగిలిపోయిన మిఠాయి, పళ్ళు సింహాద్రికిచ్చేడు అందుకొని, చేతులెత్తి మరోసారి మొక్కేడు సింహాద్రి

దొర ప్రక్కనే ఎతికిలపడి కూర్చున్న చిన్నదొర (బుగత) కాళ్లకి రామన్న మొక్కేడు కాని అతడు తన పాదాలని తాకనివ్వలేదు

[ఇంకా ఉంది]

**బాతాఖానీతో పక్కవారిపని పాడుచేయకండి ! అదే క్రమశిక్షణ**




అరవిందకి అర్ధరాత్రి మెలకువ వచ్చింది భర్తని తట్టి లేపుతూ అడిగింది

ఏమండీ! బాత్‌రూంకి వెళ్లాలి తోడు రారా అని

లైటేసుకుని వెళ్లు ఏం భయం? అన్నాడు అరవింద భర్త నిద్రమత్తులో

అరవింద తన ప్రక్కనే వున్న రెండు నెలల పాపకి దుప్పటి సరిగ్గా కప్పి లేచి గదిలో లైటూ బయట నడవా లైటూ వేసింది తలుపు తెరచుకొని బాత్‌రూంలోకి వెళ్ళింది

తర్వాత వచ్చి లోపల గడియపెట్టి పడుకుంది లైటార్పేసి పాలు తోడేయడం మర్చిపోయిన సంగతి గుర్తుకువచ్చింది అప్పుడు మళ్ళీ లేవడానికి బద్ధకంవేసి అలానే పడుకుంది వెంటనే నిద్ర పట్టలేదు

ఎదురుగా గోడమీద బయటనుంచి వీధి దీపం కాంతి పడుతోంది తెరచివున్న కిటికీలోంచి అందుకనె ఆ గదిలో బెడ్‌లాంప్ అవసరం వుండదు రాత్రుళ్లు

అరవింద కళ్లు చికిలించి చూసింది అనుమానంగా

సందేహంలేదు ఎదురుగా గోడమీద ఏదో నీడ నెమ్మదిగ కదులుతోందా నీడ భయంకరంగా వుందా నీడ మామూలు మనిషి నీడ కాదది రాక్షసుడి నీడలాగానో వుంది అది అతి పొడుగ్గా

నెమ్మదిగా కదిలి మీద మీదకి వచ్చేస్తోంది వచ్చేసింది అరవింద గుండెలమీద కూర్చుందా నీడ రెండు చేతులతోనూ గొంతు నులుముతోంది గట్టిగా ఇద్దరు ముగ్గురు అతిబలవంతులు మీద కూర్చున్నట్లుగా అనిపించింది అరవిందకి ఊపిరి అందటంలేదు కళ్లు తేలేసింది

గట్టిగా అరుద్దామని విశ్వప్రయత్నం చేసింది కాని అరవటం చేతకాలేదు కనీసం మూలగలేక పోయింది రెండు చేతులూ కాళ్లూ దబదబ బాదింది బాధగా

ఎక్కడో నూతిలోంచి వినబడినట్లుగా వినబడింది పాప ఏడుపు స్పృహతప్పినట్లుగా అయిపోయింది

అరవింద భర్త లేచి అరవిందని కుదుపుతూ అడిగాడు కంగారుగా ఏం అయింది! ఏమిటి? అంటూ

కొన్ని నిముషాల తర్వాత తెప్పరిల్లింది

ఏం జరిగింది? మళ్లీ అడిగాడు

అబ్బ! ఏదో నీడలాంటిది ఆ గోడమీద నుంచి వచ్చి నామీద వాలింది గుండెలమీద కూర్చుని గొంతు నొక్కింది అరవనయినా అరవలేక పోయాను

ఆయన లేచి లైటు వెలిగించి చూసాడు ఎవరూ లేరు గదిలో మంచంకింద గాని బీరువా వెనకగానీ

ఎవరూ లేరు కలగని వుంటావ్ పడుకో అన్నాడు

కలకాదండీ ఇప్పుడేగ వచ్చి పడుకున్నాను ఇంకా నిద్రపట్టలేదు నిజంగా ఏదో నీడ మీద వాలింది అన్నది భయంతో గుండెలు టకటక కొట్టుకుంటూంటే

కాళ్లు కడుక్కొచ్చావా? అడిగాడాయన

లేదు జవాబు చెప్పింది

కాళ్లు కడుక్కొని మంచినీళ్లు తాగి పడుకో పైత్యంచేసి అలా భ్రమకలిగి వుంటుంది

భ్రమ కాదండి నాకెందుకో భయంగా వుంది నన్నానుకుని పడుకోండి మీకు పుణ్యం వుంటుంది అన్నది వణికే కంఠంతో

చాలాసేపటిదాకా నిద్రపట్టలేదు అరవిందకి ఇందాకటి సంఘటన తల్చుకుంటూనే ఒళ్లు జలదరిస్తోంది

అకస్మాత్తుగా కింద భాగంలోంచి ఓ ముసలి ఏడుపు వినబడడంతో ఉలిక్కిపడింది అరవింద భర్తని కరచుకున్నట్లుగా పట్టుకుంది

పాపతో యిద్దరూ కిందకి వెళ్లారు ఆ ఏడుపు విని ఏం జరిగిందని అడిగారు

ఇంకేముంది నాయనా నా కూతురు నన్నాన్యాయంచేసి పోయింది కానుపయి నెలయినా కాలేదు ఎందుకో గట్టిగా అరిచింది నిద్రలో దగ్గరకి వెళ్లి చూస్తే అప్పటికే కళ్లు తేలేసింది ఎండంటి మనమరాలిని నా కప్పగించి వెళ్లి పోయింది

వెంటనే అరవింద భర్త చేయి గట్టిగా పట్టుకుని భీతిగా అన్నది

ఇందాక ఇందాక యమదూతేమోనండి కొంపతీసి పొరపాటున వచ్చివుంటాడేమో? నంది

# ధర్మపథం

## భూగోదోహనం

కాళిదాస మహాకవి కుమారసంభవంలో హిమాలయ పర్వతాన్ని వర్ణిస్తూ భూమిని గోవుగాను, హిమాలయాన్ని దూడగాను చేసి, మేరుపర్వతాన్ని దోగ్ధగా నియమించి పృథుచక్రవర్తి రత్నాలనూ, ఓషధులనూ పితికినట్లు చెప్పాడు పృథుచక్రవర్తి మనువును వత్సముగా చేసి గోరూపధారిణి యైన భూదేవినుండి ఓషధులను పితికినట్లు భాగవతంలో ఉన్నది

పృథుచక్రవర్తి తండ్రి వేనుడు దేవతలను నిందించి, తానే సర్వమునకు కర్తనని భావించి ప్రజలను హింసించాడు రాజ్యం అరాచకం అయిపోయింది మహామునుల శాపం వల్ల అతడు నశించాడు తర్వాత పృథువు రాజైనాడు పంటలు లేవు దొంగభయం మున్నగునవి ప్రబలంగా ఉండినవి ప్రజలు మొరపెట్టుకోగా పృథుచక్రవర్తి పంటలు ఇవ్వనందుకు భూమిపై కోపించి దానిని శిక్షించడానికి విల్లమ్ములు ధరించి బయలుదేరాడు భూమి భయపడి గోరూపం ధరించి పారిపోసాగింది చక్రవర్తి దానిని విడువలేదు దానివెంట పడాడు ఆ గోవు అలసిపోయి తన్ను చంపవద్దని, తన్ను గమనించకపోవడం వల్ల ఓషధులూ, అవీ లభించలేదని, తగిన వత్సాన్ని ఏర్పాటుచేసి పితికితే అన్నీ లభిస్తాయని, అస్తవ్యస్తమైపోయిన తన్ను సమమైన పద్ధతిలో ఉంచాలని ప్రార్థించింది పృథువు మనువును దూడగాచేసి తానే దోగ్ధగా ఓషధులను పితికాడు ఇదీ పురాణగాథ

భూమి గోవు కావడమేమిటి? దాన్ని పితికితే రత్నాలు, ఓషధులు లభించడమేమిటి? అని దీన్ని కొట్టిపారెయ్యకూడదు ఇందులోని అంతరార్థం గ్రహించాలి దేశం బాగోగులకు రాజే కారణం వేనుని అక్రమ పాలనవల్ల ప్రజల్లో క్రమశిక్షణ లేకపోయింది దొంగభయాలెక్కువ బలహీనుల్ని బలవంతుడు చాలా హింసించేవాడు అడిగేవాళ్లు లేరు కదా! భూమి ఎత్తుపల్లాలతో నిండి వ్యవసాయ ననుగుణమైపోయింది దాన్ని ఎదునుచేసి పడిన వర్షం వ్యర్థం కాకుండా పొలాలకు పారాలి పంటలు పండాలి పృథుచక్రవర్తి రాజ్యానికి వచ్చాక భూమినే సమతలమైనదాన్ని చేసి, పడిన వర్షాలు వ్యర్థం కాకుండా ఏర్పాటుచేశాడు ఓషధులను పితికడం అంటే పంటలు పండేటట్లు చేశాడన్నమాట సస్యాలన్నీ ఓషధులనే సంగతి మరచిపోకూడదు ఆ విధంగానే గనులు త్రవ్వించి ఖనిజాలను, రత్నాలనూ భూగర్భంనుంచి బయటికి తీశాడు భూగర్భంలోంచి బయటికి తీయడమే భూమిని పితకడం ఈ పితుకుట గోవునకు సంబంధించిన కృత్యం కాబట్టి భూమిని గోవుగా చెప్పవలసివచ్చింది వెనుకటి రాజుల కాలంలో బాగా ఉండినా, ఒక్క వేనుడి మూలంగా దేశం ధ్వస్తమయింది బాగుపడటానికి ఎక్కువకాలం కావాలి కాని నశించడానికి అత్యల్పకాలమే చాలును గదా!

ఈ రీతిని పృథుచక్రవర్తి తిరిగి రాజ్యాన్ని బాగుచేసి, ప్రజల క్షేమానికి ఎంతో పాటుపడ్డాడు అందువల్లనే పృథుచక్రవర్తి భగవంతుని లీలావతార మూర్తులలో ఒకడైనాడు

— బులుసు వేంకటరమణయ్య

---

*సామాన్యుని సణుగుడు*

## దింపమన్నావా? మెఱుపు తీగల్ని!?

అయ్యో! మీరింకా ఎన
రేదు కాబోలు
ఈమధ్య కొత్తరకం
యుద్ధ తంత్రాలు
గట్టిగా కనిపెడుతున్నారట

ఆకాశంమీద తళుక్కున
మెరిసే మెఱుపుతీగల్ని
భూమ్మీదకు మళ్ళించి
వాటిని శత్రుస్థావరాలపై
కురిపించగలరంట!
దాంతో "అని దెబ్బకి రా!"

సముద్రంమీద ఎటో
పోయిన్న గాలివానల్ని
పిలకపట్టుకు రప్పి
శత్రువుల తీరంమీదకు
దాడిచేయించగలరంట
బాబ్బాబో! యివేవో
మంత్రగాండ్ర గారడి
విద్యలు లనుకోకండి
వీటికి భూ భౌతిక
శాస్త్రయుత శస్త్రాలని
అనగా జియోఫిజికల్
వెపన్స్ అని నామకరణముంది
మున్ముందు బాంబులు
వేయడానికి బదులు
కొండలను నదులను
మళ్ళించడం, అడవులను
ఆకాశపు పిడుగులను
శత్రువులపైకి వదపడం
గట్రా యుద్ధరంగంలో
ప్రవేశించేస్తాయంట!

ఈ సైంటిస్టులున్నారే
తిట్టకూడదుగాని
అసాధ్యపు ముం కులు
పైన పేర్కొన్నలాంటి
వెన్నో చేసేశారు!
కాని—అవినీతిని
ఉరికట్టే శస్త్రాన్ని
అధికధరల్ని అదుపు
చేసే మంచి అస్త్రాన్ని

జీతంకోసం జీతం
కిట్టేమేరకైనా
క్రమశిక్షణతో
ఇంతో అంతో చాకిరీ
చేసే నైజాన్ని
జనావళి మస్తిష్కంలో
ప్రవేశపెట్టే ఇంజక్షన్ని
కనిపెట్టరెంచేతని?
బ్రతికే ఏభై అరవై
సంవత్సరాల స్వల్ప జీవితంలో
పక్కవాడి కుత్తుక
కొరకే "నెత్తురు తాగే
దాహాన్ని" చంపే మాత్ర
ఇరుగు పొరుగుల మధ్య
సామరస్యం నెలకొలిపే,
చేదుగా వుండేదైనాసరే
ఓ 'సిరప్'
తయారు చేసి
మన మొహాన
పోసేస్తే యీ సైంటిస్టుల
మీద మంచి కవిగాణ్ణి
పిలిచి ఓ దండకం ఐనా
రాయించకపోదుమా?
చెప్పండి కాని కాని .
ఇదంతా భ్రమ—కొండల్ని
నడిపించి, పిడుగుల్ని
కురిపించి మెఱుపుల్ని
ఝళిపించి జనాన్ని
హడలగొట్టిస్తే
వచ్చే 'థ్రిల్' పై మానవ
సేవలో ఎలా వొస్తుంది? చెప్పండి
ఏమంటారు? ..

[ వీరాజీ ]

# వారఫలం

మహేష్

**4-6-1976 శుక్రవారం మొదలు**
**10-6-1976 గురువారం వరకు**

**మేషం:-** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి అనవసరమైన సందేహాలు కలుగుతాయి ఇతరు నిమిత్తం శ్రమకు గురి కాగలరు. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాసవస్తువులు కొంటారు

**వృషభం.-** ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది దైవ కార్యాలు నెరవేరతాయి

**మిధునం:-** సంతోషకరమైన వార్తలను వింటారు వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. వారం అఖరులో వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. స్త్రీలకు- వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం -** మీ శ్రమకు దగిన ఫలితం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి పోటీవారిలో గౌరవం లభిస్తుంది ప్రయాణాలు వాయిదాపడతాయి స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**సింహం :-** మీ కార్యక్రమాలు బాగుంటాయి వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రులకు సహాయం చేస్తారు. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు

**కన్య -** ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది వృత్తిలో చికాకులు యేర్పడతాయి వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది మీ ఆలోచనలు ఫలిస్తాయి నూతన విషయాలను తెలుసుకొంటారు స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు బంధు మిత్రులను కలుసుకొంటారు.

**తుల:-** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వ్యాపారంలో యెవరిని విశేషంగా నమ్మడం తగదు. వారంఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

ఏ నక్షత్రం కడుపునిండినా
కెరటాలలో తుళ్ళిపడే సరస్సుల కన్న
మనోహర భావాల నెంతగా నింపుకున్నా
గంభీర ముద్ర ధరించే సరసులు మిన్న!

**వృశ్చికం:-** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది అధిక వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు :-** రావలసిన డబ్బు అందుతుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది ప్రయోజనం గల పరిచయాలుఏర్పడతాయి మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు- సంతోషకరమైనవార్తలను వింటారు పుణ్యకార్యాలు చేస్తారు

**మకరం -** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలుబాగుంటాయి వృత్తిలో ఆదాయం పెరుగుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు అలంకారవస్తువులుకొంటారు

**కుంభం :-** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు పోటీవారిలో గౌరవం లభిస్తుంది వారం మధ్యలో ఆందోళనకలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం ఆఖరులో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి బంధువులకు చికాకులు యేర్పడతాయి

**మీనం :-** పోటీ వారితో మాట పట్టింపులు తగవు ప్రయాణాలు వాయిదా పడతాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు వారం ఆఖరులో మీ తాలూకుమనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

# ఆదా చేసుకోండి ఒక రూపాయి!




## సింథాల్ పౌడర్‌పై— మీరు సింథాల్ సబ్బును కొన్నప్పుడు *

కూపన్ ప్రకటనతోకూడిన సింథాల్ సబ్బును కొనండి. ఆ సబ్బు యొక్క ప్రతి రేపర్ వెనుక ఒక కూపన్ ఉంటుంది ఆ కూపన్ మీ డీలర్‌కు అందించి సింథాల్ టాయిలెట్ పౌడర్‌పై (ఏ సైజుదైనా సరే) ఒక రూపాయి తగ్గింపును అందుకోండి







*స్టాకులు వున్నంతవరకే మరి ఈ సదుపాయం'

Interpub/GS/13/75 TL

# చక్కని రాజమార్గం

చెళ్లూరి సీతారామేశ్వరరావు



"ఏం నేను శెలవు తీసుకుంటాను... సాయంత్రానికి తీసుకు వస్తారుగా" శేషగిరి లేచి నిలబడ్డాడు నేను తలూపాను "తప్పకుండా"

పద్మనాభం, శేషగిరి వెళ్లిపోయారు. నేను ముఖం కడుక్కుని వరండాలో కాఫీ త్రాగుతూండగా పద్మనాభం తిరిగివచ్చాడు. "కళ్యాణీ ... మరో కప్పు" అని కేకేశాను,

"బస్సు ఎక్కించాను. ఆఫీసర్‌ని కల్సుకుని సాయంత్రానికి వస్తానన్నాడు." అన్నాడు పద్మనాభం కాఫీ త్రాగుతూ!

నిరుద్యోగి దినచర్యలా బద్ధకంగావుంది ఎండ. శేషగిరి చెబుతున్న మాటలు ఒకవైపు సంతోష పెడుతున్నాయి, మరోవైపున ఆందోళన కల్గిస్తున్నాయి. ఇది జీవితం. ఇంద్రజాలంగా ఏవో పనులు జరిగిపోతాయంటే సామాన్యుడు నివ్వెరపోతాడు. అల్పజీవిగా వాటికి వారసత్వం పొందడానికికూడ వెనకా ముందూ చూస్తాడు.

"ఏమిటాలోచిస్తున్నావ్? శేషగిరి గురించా ... వాడు ఉద్దండుడోయ్! పైకి పిట్టలా వుంటాడు కాని గండర గండడు! మనకి సాయంచెయ్యడానికి వచ్చిన దేవదూత" అన్నాడు హాస్యంగా.

"శేఖర్ని తీసుకొస్తావా?"

"ఎలాగోయ్ ... సెక్రటరీ వస్తానన్నాడు. పోనీ ఫోన్ చెయ్యకూడదూ?" వెళ్లలేక పోయినందుకు నొచ్చుకుంటూ అన్నాడు.

"ఏదో చేద్దాంలే..." స్నానానికి లేచాను. మనసంతా అలజడిగా వుంది. పరాకుగావుంది. ఒక సమస్యని ఎత్తుకుంటే అది తరిగేదాకా నాకు ఆలోచనలు తప్పవు.

"ఏమిటీ పరధ్యానం...ఇదంతా బావమరిది ఉద్యోగం గురించేనా ఏమిటి?" టిఫిన్ ప్లేటు యిస్తూ కళ్యాణి కిసుక్కుమని నవ్వింది.

"అమ్మడూ ఇది వంకాయకూర వొండటం కాదు. అయినా మీవాణ్ని గురించి యింత ప్రయత్నిస్తూంటే నీకేదయినా కృతజ్ఞత వుందా?" కోప్పడ్డాను.

డిపోలో పనికూడ అట్టే లేదు. ముందర శేఖర్‌కి ఫోన్ చేశాను. లైను తొందరగానే వచ్చింది, శేషగిరి ఆఫర్ క్లుప్తంగా చెప్పి "వెంటనే రా" అన్నాను.

నావల్లయినా శేఖర్‌కి ఉపకారం జరిగితే చాలు. గ్రాడ్యుయేట్ అయి వేల పుచ్చుకుని కూర్చున్నాడు. ఎన్నిసార్లు వేసినా ఖాళీ వలే పైకి వస్తూంట. అవకాశాలు రాకా, అదృష్టం లేక శేఖర్ దిక్కులు చూస్తున్నాడు. రెండువేలు పోయినా శుభ్రమయిన వుద్యోగం వస్తుంది. వెనకా ముందూ చూడక్కర్లేదు.

ఆ సాయంత్రం పద్మనాభం, శేషగిరి సొసైటీ దగ్గరకి వచ్చారు. అంతకుముందే శేఖర్ వచ్చాడు. కాఫీలు తెప్పించాను.

"ఆయన ఒప్పుకున్నాడండీ. అప్లికేషన్ యిస్తే రేపు సాయంత్రానికి ఆర్డర్స్ పట్టుకు వచ్చేస్తాను. డబ్బు అప్పుడే యివ్వండి." శేషగిరి అన్నాడు.

నాకు అందులో ప్రమాదమేమీ కనిపించ లేదు డబ్బు ముందర తీసుకుని ఆరగించేసి మొండిచేతులు చూపించిన కథలు ఎన్నో వున్నాయి శేషగిరి చెప్పేదానిలో ఫ్రాడ్‌కి అవకాశం కనిపించలేదు

ఎనిమిదింటికి శేషగిరి వెళ్లిపోయాడు. ఆ విషయంమీదే కబుర్లు చెప్పుకుంటూ పది గంటలదాకా అక్కడే కూర్చున్నాం.

మర్నాడు ఆదివారం శేషగిరికోసం ఎదురు చూడటం మాకు ప్రొద్దుటనుంచీ ఒక పని. ఆలస్యమైన కొద్దీ ఆందోళన. నాలుగున్నరకి పద్మనాభం నేను బజారుకి బయలుదేరాం. బస్సుదిగి వస్తున్నాడు శేషగిరి. మమ్మల్ని చూసి పలకరింపుగా నవ్వాడు. తొందరగా దగ్గరకెళ్లి, "కాయా! పండా" అన్నాను. జేబులోనుంచి అపాయింట్‌మెంట్ ఆర్డర్స్ తీసి యిచ్చాడు.

నాకు ఎనలేని సంతోషం వేసింది. 'పద్మం...ఆయన్ని సొసైటీ దగ్గరికి తీసుకు వెళ్లు. నేను డబ్బు తీసుకొస్తాను" అన్నాను ప్రక్కకి పిల్చి.

ఆర్డరు చూపించిన వెంటనే శేఖర్‌లో దీపాలు వెలగలేదు. క్రిందా పైనా అను మానంగా చూసి "ఈ ఆఫీసుకి సంబంధించిన

## హైదరాబాద నోట్ బుక్

(6వ పేజీ తరువాయి)

పని?" అన్నారు వారు. వారి నిజాయితీకి ఒక ఉదాహరణనిచ్చారు డాక్టర్ శాస్త్రి. "మా ప్రభుత్వం పనిమీద తురాబ్లిస్ (ట్రిపోలి) వెళ్లాను. అక్కడ ఒక హోటలులో మా నాలుగేళ్ల అబ్బాయి శ్రీ రామశాస్త్రి రిస్ట్ వాచి మరచిపోయాము. చూసుకోలేదు. చాల విలువైనది. ఎక్కడో పడిపోయిందిలే అని సర్దుకున్నాము. దేశానికి తిరిగి వచ్చేటప్పుడు మరోసారు తురాబ్లిస్‌కు వెళ్ళవలసి వచ్చింది. హోటల్లో గది కోసం వెదుకుతూ, ఆ హోటలుకే వెళ్లడం తటస్థించింది. మేనేజర్ ఎమ్మల్ని చూడగానే గుర్తుపట్టి, గది లేదు గాని, మీరు మరచిపోయిన గడియారం ఉంది. మీ పత్తా తెలీలేదు. ఎక్కడికి పంపాలో తోచలేదు. ఎంబసీలో అడుగుదామంటే, ఏమని అడుగగం.? అంటూ బాగా ప్యాక్ చేసిన ఒక చిన్న అట్ట పెట్టె అందించారు. భారతీయులంటే వారికి మంచి అభిప్రాయం ఉంది. కాని భారతదేశం గురించి వారికి అంతగా తెలియదు. పాకిస్తాన్ పత్రికలు వస్తాయి గాని, భారతదేశపు పత్రికలు రావు. కనుక మనదేశ పత్రికల ఇంటర్ నేషనల్ ఎడిషన్లు అక్కడికి పంపడం అవసర మంటారు డాక్టర్ శాస్త్రి. అక్కడ ప్రతి రంగంలోను భారతీయులున్నారు. కనుక సరాసరి విమానయానం ఉండాలి. అక్కడి వారి మర్యాదలను గురించి చాలా ఉత్సాహంతో వివరించారు డాక్టర్ శాస్త్రి ఎలిమ.కి శ్రీపంటి వారట.

ఉపశ్రుతి :

"ఆ! అన్ని చెట్ల వాడిలు పోతున్నాయి. కాని గ్లోబిలేవన్ చెట్టు వాడిపోవడంలేదు" అన్నాడు ఒక ఉపాధ్యాయుడు నాతో. "ఇప్పుడు మీకు అలాగే ఉంటుంది. గూ. బి. సి. స్కేళ్లు వస్తే ఇది ద్యాటికా వాగముందిలెండి. చెట్టి అనే పదం మీరూ పెట్టేస్తారు".

— తిరుమల రామచంద్ర

## చక్కని రాజమార్గం

వారికెవరయినా చూపించండి. మనకి చాలా మంచిది" అన్నాడు.

సదాశివం దగ్గరకి నడిచెళ్ళాం. ఆర్డర్ చూసి "బాగా ఫిట్ చేశాడు. మా డిపార్ట్‌మెంట్‌లో ఖాళీ ఏం లేదు. ఆర్డర్ యిలా వుండదు. ఏమైనా యిచ్చారా?" అన్నాడు.

జరిగినది చెప్పి నాలో సొసైటీ దగ్గరకి తీసుకెళ్ళాను. శేషగిరి విలాసంగా సిగరెట్టు కాలుస్తూ కబుర్లు చెబుతున్నాడు.

సదాశివం క్రాస్ చేశాడు. ప్రశ్నమీద ప్రశ్న వేశాడు. శేషగిరి చిన్నముఖం వేశాడు. తల వంచుకున్నాడు. "తప్పే" అన్నాడు

పద్మనాభం లెంపకాయ తిని.

శేషగిరికిది కులవృత్తి. అర్ఘ్యం స్వయంగా తయారుచేసి వేలకివేలు గుంజి నిరుద్యోగులని గోతుల్లోకి తోస్తున్న నీచుడు ఈ హడావిడికి ప్రక్కవాళ్ళందరూ ఝూగారు శేషగిరి చేసిన పని పని ... దండనీతి ప్రయోగించారు. లిప్తాలు కాదేలా దారుణంగా బాదేశారు నేను వాక్యం చెనుకుని విడిపించి చట్టానికి ఒప్పగించాను.

మోసాన్ని తప్పుకున్నా నాకు తృప్తిలేదు రాజమార్గాలు అందుకోలేక సామాన్యుడు అడ్డదారికి ఏస్తున్నాడు. అదీ గగనకుసుమమే అయింది. ఇంతకీ ఏది మార్గం ? ఏది రాజ మార్గం? ఏది యింకా చక్కని రాజమార్గం? చెప్పండి !

కని వాళ్ళతో సభ్యతగానే మాట్లాడి పంపించేయ్! తరువాత దీని సంగతేమో ఇలా...” అంటూ పొగ రగిలించింది విశాలాక్షమ్మ!

## కను విప్పు

(18వ పేజీ తరువాయి)

రఘు రాగానే ... అగ్ని కాజ్యం పోస్తున్నట్టుగా మాధవరావు సుగుణల నవ్వులు మంత్రించినట్లు ఆగిపోయాయి! సుగుణ మాటలకోసం తడబడుతున్నట్లు. మాధవరావు ముఖంలో నెత్తురుచుక్క లేనట్టు ఫీలయ్యాడు రఘు.

“నమస్కారం సార్! రఘుగారూ! ప్లీజ్ డ్ టుసీయూ! ఏ నెప్పుడొచ్చిరా - మీ దర్శనం కావటంలేదు! ఇవ్వాళ అనుకోకుండా మిమ్మల్ని కలుసుకోవటం చాలా సంతోషంగా ఉంది!” అన్నాడు మాధవరావు. అతను నవ్వుతుంటే - అది తెచ్చిపెట్టుకున్న నవ్వులా ఉంది. రఘుకు అతనిమీద చాలా మంటగా ఉందతనికి పైకి మాత్రం సభ్యత లోపించకుండా.

“నమస్కారం! మీగురించి మా మిసెస్ తరచుగా చెపుతూనే ఉంటుంది. ఏదో అవకాశంలేక మిమ్మల్ని కల్సుకోటం పడలేదు. అయినా...ఆ యిబ్బంది ఏమీ వుండనీయదు లెండి! మా సుగుణ చాలా కలుపుగోలుమనిషి!” అంటూ ఇరువుర్ని మార్చి మార్చి చూశాడు రఘు. విశాలక్షమ్మ తనకేమి పట్టనట్టుగా నటిస్తూ దూరాన నిలబడి, చోద్యం చూడ సాగింది. ఓ అయిదు నిమిషాలు .. మంచితనం నటిస్తున్న రఘుతో మాట్లాడి వెళ్లిపోయాడు మాధవరావు ఇరువైపులా పులుల్లా కనిపిస్తున్న విశాలక్షమ్మ.. రఘులను - తప్పించుకోటానికి భీతహరిణేక్షణలా లోనికి పోబోయింది సుగుణ. అది రఘుకు ఎన్నో రకాల అర్థాలను చాటిచెప్పింది.

“ఆగు! ఎన్నాళ్లుగా సాగుతోందీ వ్యవహారం?” దగ్గరగా వెళ్లి మెడమీద రెండు గుద్దులేశాడు. పక్కలో బాంబు పడ్డట్టు అదిరి పడింది సుగుణ! నిర్మలాకాశం ఉరుము తుందని ఎవరూహిస్తారు? కాని ఉరుముతున్న మాట నిజం! ఏమనాలో తెలియక ఏం చెప్పాలో తెలియక అదోరకంగా అతనివైపు చూసింది సుగుణ కన్నీరు జాలువారుతుండగా. ఆ చూపులో యుగ యుగాలుగా మగవాడి దౌష్ట్యానికి అన్యాయంగా బలైపోతున్న మానినిబాధ...కన్నీటిగాథ...అసహాయురాలైన స్త్రీ దైన్యం! మూర్తీభవించి వుంది.

తన పథకం తనయుడంత తెలిగ్గా అమలు జరపటం విశాలాక్షమ్మకెంతో సంతసాన్ని కలిగించింది!

“ఏమండీ మీరుగూడా నన్ను...” అనుమానిస్తున్నారా అన్న భావం ఆ ప్రశ్నలో వుంది!

“నోర్ముయ్! నేనేం వినదల్చుకోలేదు

## యువతరం

పి. విల్సన్ రాజ్ కుమార్ స్వస్థలం విజయవాడ అయినా తెనాలి వి. ఎస్. ఆర్. కళాశాలలో బి. ఏ. ఫైనలియర్ చదువుతున్నాడు. క్రికెట్



వాలీ బాల్, టేబిల్ టెన్నిస్‌లు ఆడతాడట. నాటకాలల్లో వేషాలు కట్టాడు. మూడు సంవత్సరాలుగా అంతర్ కళాశాల నాటక నాటిక పోటీల్లో అత్యుత్తమ నటుడు, ఉత్తమవిలన్‌గా బహుమతు లందుకున్నానని చెప్పాడీ యువ కళాకారుడు. నాటకాల్లో తిరిగినంతమాత్రాన చదువుమీద అశ్రద్ధ చూపకూడదు అంటున్నాడు.

హిందీ, తెలుగు భాషల్లో వుత్తమ సినిమాలు చూస్తాడు. అక్కినేని, సంజీవ్‌లు అభిమాన నటులు గ్రెగరీపెక్, చార్లెస్ బ్రాన్‌సన్‌లు నటించిన ఇంగ్లీషు బొస్కోపులన్నీ చూస్తానన్నాడు.

పత్యేకంగా సినీ నటుల్ని చూడ్డం ఇష్టంలేదు. మన రాజకీయ నాయకుల్ని మించిన నటులు మరిలేరు అంటున్నాడితడు. కాలేజీల్లో అమ్మాయిలు లేకపోతే అందం వుండదు. అందుకని కో - ఎడ్యుకేషన్ వుండాలి అన్నది ఇతని అభిప్రాయం.

'జీవిత భాగస్వామిని ఎన్నిక చేసుకోవటంలో పెద్దవారి పాత్ర వుండరాదు. పిల్లలకే పూర్తి స్వేచ్ఛ నివ్వాలి' తాగుడుమీద మనసులేదు– సిగరెట్లు మాత్రం అప్పుడప్పుడు కంపెనీ కోసం తాగినంత మాత్రాన తప్పులేదు అనేది ఇతని అభిప్రాయం.

ఎమ్. ఏ. చదివి ఆ తర్వాత ఫిలిం యాక్టింగ్ స్కూల్లో నటనలో శిక్షణ పొందాలన్నది ఈతని ఆశయం.

---

ముందు నువ్వు...నువ్వు..." చాలా కటినంగా వున్నాయి రఘు మాటలు.

"పుట్టింటికి పొమ్మంటారు! అంతేగా?" ఆ మాత్రం అర్థం చేసుకోలేనిదాన్ని కాదులెండి!" కళ్లల్లో నీళ్లు చివ్వున చిప్పిల్లాయి సుగుణకు. "తప్పుచెయ్యని వాడ్ని నువ్వే తప్పు చేశావు!" అని దండిస్తే ఎలా వుంటుందో... అలా వుంది ఆమె పరిస్థితి.

"అర్థం చేసుకొన్నదానివయితే వెంటనే దయచెయ్యి!"

"లేకపోతే..." ధైర్యం కూడదీసుకుంటూ గొంతు పెగుల్చుకుని అంది సుగుణ.

"మెడబట్టి గెంటాల్సి వుంటుంది!"

అంతమాట పడ్డాక ఇక అక్కడుండటం అనుచితమనిపించింది. తన బ్రతుకిలా అన్యాయంగా కూలిపోతున్నందుకు... కాలిపోతున్నందుకు వలవలా విలపిస్తూ...బట్టలు సర్దుకుని బయలుదేరింది. అన్యాయంగా అవనింద వేసి పంపుతున్న ఆ తల్లీకొడుకులను చూస్తే ఎక్కడో హృదయపు పొరల్లో వున్న రోషం... ఆవేశం పెల్లుబికి పైకొచ్చాయి అత్తకు– భర్తకు – తనిస్తున్న శాపమా అన్నట్లుగా "అక్రమంగా నన్ను వెళ్లగొట్టినంతమాత్రాన మీరు సుఖపడతారనేది కల్లోమాట! భర్త వదిలిన భార్య...ఈ సమాజంలో ఎటువంటి విమర్శలకు గురవుతుందో...! భార్య – దగ్గర లేని భర్త గతి కూడా – అంతే!!" అని శోకమూర్తిలా వెళ్లిపోయింది బస్టాండుకు.

"శభాష్ రఘూ! నువ్వు నిజంగా శ్రీరామచంద్రుడిలాంటి వాడివి!" అంటూ కొడుకు చేసిన ఘనకార్యానికి అభినందించింది తల్లి.

"నీ మాట జవదాటితే నా బ్రతుకెందుకమ్మా!" మాతృభక్తిని ప్రకటించాడు రఘు.

కూతురికి జరిగిన అన్యాయానికి ఎంతో వగచారు పద్మనాభయ్య దంపతులు. ఈ విషయంలో తామేం చెయ్యాలో ... ? కూతురి కాపురాన్నెలా చక్కబెట్టాలో వారికి అర్థం కాలేదు. మొగుడొదిలేసిన భార్యగా రేపటి నుంచి సుగుణ ఎలాంటి విమర్శలు ... విషమ పరిస్థితులు ఎదుర్కోవాలో ... నని తమలో తామే కుమిలిపోయారు.

ఇహపోతే పెళ్ళాన్నొదిలేసిన మగ మహారాజు! రఘు ఎంత సుఖపడుతున్నాడో చూద్దాం!

తల్లి మనసు నొప్పించలేని బలహీనత కొద్దీ.. భార్యను తిట్టి తగిలేశాడుగానీ ... సుగుణ లేని లోటు చాలా విషయాల్లో కనిపించ సాగింది. రాత్రిళ్లు సంగతలా ఉంచి సాంఘికంగా తన పొజిషన్ చాలా దిగజారి పోయిందని తెలిసి వచ్చింది రఘుకు.

ఇదివరకు ఎవరింటికన్నా జంటగా వెడితే ఎంతో మర్యాద మన్ననా చూపేవాళ్ళు ... చక్కగా రిసీవ్ చేసుకుని– అతిథి సత్కారాలు ఘనంగా జరిపేవాళ్ళు. ఇప్పుడో ... 'ఎందుకొచ్చిన శనిరా!' అంటూ తప్పించుకుంటున్నారు.

## కనువిప్పు

ప్రాణమిత్రుడనుకున్న ప్రభాకర్ ఇంటికి వెడితే వాడి ముఖంలో ... తన రాకకు అయిష్టత స్పష్టంగా కనుపించింది. కారణం — వాడి భార్యగూడా చాలా అందంగా ఉంటుంది! ఎక్కడ తను వాడి భార్యతో ఎక్కువగా మాట్లాడుతాడో ... ఆమెను కొరుక్కుతినేస్తాడేమోనన్న భయంతో ప్రవర్తించాడు. అయిదు నిముషాలవ్వగానే

"ఆఫీసు పని ఉందోయ్ మరోసారి కలుసుకుందాం!" అంటూ లేచిపోయాడు. "వదిన్ని పుట్టింట్లో ఎందుకన్నయ్యగారూ ఉంచటం? ఇక్కడ మీ కిబ్బంది కాదూ?" అంది ప్రశ్నార్థకంగా ప్రభాకర్ భార్య. ఆమె మాటలో నీ భార్యను పుట్టింట్లో ఉంచటం దేనికి? నువ్విలా తిరగటం దేనికి? అన్న హెచ్చరిక ఉందని గ్రహించాడు రఘు బాగా పరిచయం వున్న సుబ్బయ్యగారింటికెడితే ఆయన తన వయసొచ్చిన ఆడపిల్లల నందరినీ అలమరలో పెట్టి దాచి పెట్టినట్లు ప్రవర్తించారు– ఒక్క ఆడపిల్లనయినా తనతో మాట్లాడనీయకుండా! ఇదే ఇంతకు ముందు సుగుణతో వెడితే ఆడపిల్ల లందరూ తనతో చనువుగా మాట్లాడిన వాళ్లే!

ఎదురింటి జంట సరేసరి! తననవహాస్యం చేస్తున్నట్లుగా కిసుక్కున నవ్వి చెయ్యిచెయ్యి కలుపుకుని గదిలో దూరేవారు తను గమనిస్తున్నప్పుడు.

ఇక కాలేజీలో పరిస్థితి మరీ దారుణం! తన వెనక "పెళ్లాన్ని వదిలేసి రోడ్లు సర్వే చేస్తున్న లెక్చరర్ ఆయనేరా!" అని కొంత మంది కుర్రాళ్లు మర్యాదగా మాట్లాడితే... "అందమైన పెళ్లాల సేవలను అనుభవించే అర్హత అందరు చవటలకూ ఉండదురా!" అంటూ ఘాటుగా విమర్శించే వాళ్లు కొంత మంది విద్యార్థులు. కాగా కో లెక్చరర్స్‌కిదో వినోదమైపోయింది! "సరదాగా షికారు పోదాం! రమ్మ"నెవరైనా అడిగితే "సారీ! బ్రదర్! మాకు ఇంటిదగ్గర పెళ్లాం బిడ్డలున్నారు! నీలాగా రికామీగా లేము!" అనేవారు తన స్థితిని ఎత్తిచూపిస్తూ.

ఒకసారి ఇద్దరు లెక్చరర్‌లమధ్య పోట్లాట వచ్చి.. అందులో ఒకతను... "నేను చాలా నీతిపరుణ్నోయ్! పెళాన్ని వదిలేసి... వెరైటీ కోసం రోజుకో చోటు వెతుక్కుంటూ పోయే వాణ్ణి గాదు కొంతమందిలా..!" అన్నాడు.

ఒకసారి ప్రిన్సిపాల్ ఏదో స్పెషల్ పార్టీ కండక్టు చేస్తుంటే...తనకాహ్వానం రాకపోతే వెళ్ళి అడిగాడు రఘు ప్రిన్స్‌పాల్‌ను. "సారీ! మిస్టర్ రఘు! ఈ పార్టీలో పాల్గొనటానికి భార్యలను తీసుకుని రాగలిగినవాళ్లే అర్హులు! కొన్ని కారణాల దృష్ట్యా ఆ అర్హత మీరు కోల్పోయారని విన్నాను. ఐ కాంట్ హెల్ప్ యు!" అన్నారు నొసలతో వెక్కిరిస్తూ.

బజారులో వస్తుంటే వీధి అరుగుల మీద కూర్చునే పనిపాటలులేని నిషేధరాయుళ్లు కూడా. "వాడేనా పెళ్ళాన్నొదిలిపెట్టినవాడు!" అంటుంటే భరించలేకపోయేవాడు రఘు వాళ్ళందర్నీ ఖండ ఖండాలుగా నరికితే...!?" పళ్ళు పటపట నూరాడు నిస్సహాయంగా

విశాలాక్షమ్మ పరిస్థితీ అలానే వుంది. 'మీ కోడలెప్పుడు వస్తుందమ్మా విశాలాక్షమ్మా!" అని తెలిసీగూడా కొందరడిగితే ఏం జవాబు చెప్పాలో తెలియలేదామెకు. 'కోడలును కొట్టించి పుట్టింటికి పంపి... కొడుకును అచ్చోసిన ఆంబోతులా ఊరిమీద

వదిలేసింది!'' అని తనవెనక అమ్మలక్కలు ఆడిపోసుకుంటుంటే చెవులు మూసుకునేది విశాలాక్షమ్మ "తన అత్త తనకు కోడంట్రికం పెట్టిందటగా! అందుకని తనకోడలుకు కోడంటికం పెడుతోందిప్పుడు. తన అత్త తీసుకు తీసుకు చచ్చింది. మరి దీనిగతి.!'' తనంటే గిట్టనివాళ్లు తనమీద నిరసన అలా వ్యక్తపరుస్తుంటే (చాటుగావే) శివశివా! అనుకుంది పుట్టింటికి పంపటం కోడలుమీద కక్ష సాధించటాని కనుకుంటే అది తనను మరో విధంగా కట్టికుడుపు తోందేమో అని కలవరపడి పోయింది విశాలాక్షమ్మ (ఇంకావుంది)

కొనండి

# ఎవరెడి జీవన్-సాథీ

ఇత్తడి టార్చ్

## యుగ యుగం వెలిగేది యుగ యుగం మన్నేది

జీవన్-సాథీయొక్క
సుందరమైన దేహం:
దళసరైన ఇత్తడి తొడుగు,
దానిపై క్రోమియం పాలిష్,
దానియొక్క మన్నికను గూర్చి
చెప్పనవసరం లేదు. ప్రతిక్షణం
ఏముహం మీ చేతులలో
మెరిసేది.




జీవన్-సాథీ
రిఫ్లెక్టర్
స్వచ్ఛమైన ఇత్తడిది—తెల్లగా
తళతళలాడేది—కాంతివం[illegible]
—ఎప్పుడూ నల్లబడనిది.
అందుకే ఫోకస్‌లో ఏవిధ[illegible]
మచ్చలు నీడలు ఉండవు—
మరియు కాంతిని కూడా
చాలా ప్రకాశవంతంగా
వెదజల్లుతుంది.

జీవన్-సాథీ
స్విచ్:
ఇతర టార్చిల స్విచ్‌ల [illegible]
మూతింతబలంగా [illegible]
మరియు మన్నికైనది. [illegible]
సార్లు కావాలన్నా నొక్కి
వదలండి అయినా [illegible]
చెక్కుచెదరనిది






నం. 950

## ఎవరెడి జీవన్-సాథీ

### లోపల, బయట—అతి దిట్టమైనది

DDM 1/11A TCL

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# ఈ వేసవిలో మీ పిల్లలకు ఎక్కడ చెమట పేలుడు సంభవిస్తుంది?

మెడ

నుదురు

రొమ్ము

వీపు

చేతులు

కాళ్లు

ఎక్కడ పేలినప్పటికీ, జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరుతో అరికట్టండి ఒక్క జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే 3 రకాలుగా పనిచేయు ఋజువైన ఔషధీయుక్త ఫార్ములా కలిగియున్నది

- చెమటను పీల్చుకొని చర్మముల రంధ్రములను మూసివేయుటను అరికడుతుంది
- క్రిముల పెరుగుదలను నిరోధిస్తుంది
- చల్లదనం హాయిని చేకూర్చి తక్షణ ఉపశమనము చేకూరుస్తుంది

స్నానము తదుపరి మరియు నిద్రపోవుటకు ముందు జాన్సన్స్ ప్రిక్లీహీట్ పౌడరు విరళంగా చల్లండి అది ఒక్కటే తల్లులు విశ్వసించే ఔషధీయుక్తమైన పౌడరు చెమట పేలుడు నుంచి ఉపశమనమును కల్గించేది — తక్షణమే




చందనపు సువాసనలో గూడా దొరుకుతుంది

## ఒక్క జాన్సన్స్* ప్రిక్లీహీట్ పౌడరు మాత్రమే మంటను ఆపుతుంది, దురదనుంచి ఉపశమనం ఇస్తుంది. తక్షణమే.

Johnson & Johnson*

